శ్రీః

మహాకవి కాళిదాస ప్రణీతః

# రఘువంశః

ప్రథమః సర్గః

పఞ్చికా సంజీవినీ టీకా ద్వయోపేతః

తైలఙ్గీమృణాళినీ టీకా సహితః చ



ప్రకాశకులు

**RAVI MOHAN RAO,** M.Sc., M.A. (Sanskrit)
Flat No. 404, Janajanam Complex, Opp. 1 Town Police Station,
CHIRALA - 523155
Cell :**94401 15411, 08594-202411**



శ్రీః

మహాకవి కాళిదాస ప్రణీతః

రఘువంశః

ప్రథమః సర్గః

పఞ్చికా సంజీవినీ టీకా ద్వయోపేతః

తైలఙ్గీమృణాళినీ టీకా సహితః చ

| | | |
|---|---|---|
| **ప్రథమ ముద్రణ** | **:** | **29-8-2013 కృష్ణాష్టమి** |
| **ప్రతులు** | **:** | **500** |
| **పేజీలు** | **:** | **300** |
| **వెల రూ.** | **:** | **200/-** |



D.T.P.:
**MR LASER PRINTS**
Chirala
Cell: **9849976054**

Printed at :
**KARSHAK ART PRINTERS**
Hyderabad.

శ్రీః

## హృదయోల్లాసము

మహాకవి కాళిదాసు పేరు చెప్పఁగానే భరతఖండమే కాదు, ప్రపంచమంతా పులకరిస్తుంది. వ్యాసవాల్మీకుల తరువాత మహాకవులలో కాళిదాసుని పేరే లెక్కలోకి వచ్చింది. ఆ మహాకవిసుధాకరుని వాక్సుధాధారలే అందుకు ప్రబల కారణం. వాగర్థాలను పార్వతీపరమేశ్వరులుగా భావించటమే కాక, సమప్రాధాన్యంతో ప్రయోగించి రససిద్ధిని సాధించిన కవితారసవైద్యుఁడు కాళిదాసుఁడు. వేద పురాణాలను చదువలేనివారు ఈ మహాకవీశ్వరుని కావ్యసముచ్చయాన్ని శ్రద్ధగా చదివి అనేక ధర్మరహస్యాలను గ్రహించి ఆచరిస్తే మహానుభావులుగా విలసిల్లఁ గలుగుతారు.

### కాళిదాసు ఎప్పటివాడు?

ఇటువంటి ఈ మహాకవి తన జన్మకాల నివాసప్రదేశాదులను గుఱించి సుస్పష్టంగా ఎక్కడా చెప్పలేదు. కావ్యాంతర్గతవిషయాలనుబట్టి, యితనిని స్తుతించినయితరకవుల కాలాదులనుబట్టి యీ కవీశుని కాలాన్ని నిర్ణయించటానికి పరిశోధకులు ప్రబల ప్రయత్నాలు చేశారు. అయితే ఈ కాలవిషయం క్రీ.పూ. 8వ శతాబ్దినుంచి క్రీ.శ. 11వ శతాబ్దివఱకు వచ్చింది. ఇందుకు వివిధదశలలో కనిపిస్తున్న కాళిదాస ప్రస్తావనలే కాక వివిధకాలాలలో బయలుదేఱిన అభినవ కాళిదాసాదులు కూడా కారకులే. ముఖ్యంగా భోజకాళిదాసకథలు కాళిదాసును 11వ శతాబ్దివఱకు తెచ్చాయి. నిజానికి భోజరాజుకు కాళిదాసుకు చారిత్రక సంబంధం లేనే లేదు. ఒకవేళ ఉంటే ఆ కాళిదాసు ఈ కాళిదాసు కాదు. ఆ కథలు కేవలం విద్యార్థులకు సాహితీప్రీతిని పెంచటం కోసం వ్రాయఁబడ్డ చమత్కృతికృతులు.

క్రీ.పూ. నాలుగైదు వందలసంవత్సరాల క్రిందట ఉన్న భాసకవీంద్రుని కాళిదాసు స్మరించాడు గనుక అతనికి ఇతఁడు తరువాతివాఁడవుతాడు. క్రీ.శ. 7వ శతాబ్దిలో ఉన్న బాణభట్టు కాళిదాసును స్తుతించాడు గనుక ఇతనికి అతఁడు ముందటివాఁడవుతాడు. ఇటువంటి మఱికొన్ని ఉపపత్తులను క్రోడీకరించిన





పలువురు పరిశోధకులు కాళిదాసమహాకవి విక్రమశకాన్ని స్థాపించిన విక్రమాదిత్యుని ఆస్థానకవియని నిర్ణయించారు. అనఁగా కాళిదాసుఁడు క్రీ.శ. 57వ సంవత్సరంలో ఉన్నాఁడని సారాంశం. సంప్రదాయప్రియులు ఈ కాలాన్నే సమర్థిస్తున్నారు. కోరిక తీరిక ఉన్నవారు సాహిత్యచరిత్రగ్రంథాలను చదివి ఆయావిశేషాలను తెలుసుకోవచ్చు.

### కాళిదాసు మనతెలుఁగువాఁడా?

అజమహారాజు ఇందుమతీమరణం కారణంగా శోకాంభోధిలో మునిఁగిపోయాఁడు? అప్పుడు వసిష్ఠమహర్షి తన శిష్యునిద్వారా అజుణ్ణి ఓదార్చటానికి శోకోపశమనసందేశం పంపించాఁడు. ఆ సందర్భంగా జీవులకు మరణం ప్రకృతి యని, జీవితం వికృతియని బోధించే శ్లోకాన్ని కాళిదాసు ఇలా వ్రాశాఁడు -

శ్లో॥ మరణం ప్రకృతిః శరీరిణాం
వికృతిర్జీవితముచ్యతే బుధైః।
క్షణమప్యవతిష్ఠతే శ్వసన్
యది జన్తు ర్నను లాభవా నసౌ॥ (8-87)

జీవులకు మరణము ప్రకృతి - అనఁగా సహజమైనది. జీవితము వికృతి - అనఁగా కర్మలఫలంగా మాత్రమే వచ్చినది - అని పండితులు చెబుతున్నారు. అందువల్ల జీవుఁడు క్షణకాలమైనా శ్వాసిస్తూ జీవిస్తే అతఁడు లాభవంతుఁడే కదా! - అని తాత్పర్యం.

మధురావిజయవ్యాఖ్యాత, ఉత్తరహరివంశవ్యాఖ్యాత అయిన మా గురుదేవులు బ్రహ్మశ్రీ పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రులవారు ఒకరోజు పై శ్లోకార్థాన్ని వివరిస్తూ “ఇలా ప్రకృతి వికృతులను గుఱించి వివరించాఁడంటే కాళిదాసు తెలుగువాఁడేమోనన్న అనుమానం కలుగుతుంది నరసింహారావ్!” అన్నారు నాతో. అయితే ఆ శ్లోకాన్ని గూర్చి పునశ్చర్చ చేయటానికి మా గురుదేవులు గాని నేనుగాని పూనుకోలేదు. ఉత్తరహరివంశవ్యాఖ్యారచనలోనే ఏండ్లుపూండ్లు గడచిపోయాయి. ఈ శ్లోకంలో చెప్పఁబడిన ప్రకృతివికృతులు ఆంధ్రభాషను స్ఫురింపఁజేసేవయితే క్రీస్తునకు పూర్వమే ఆంధ్రభాష సమగ్రస్వరూపాన్ని ధరించినట్లు ఊహించవలసి ఉంటుంది.

ఇదిలా ఉండఁగా మనమహాకవి మేఘసందేశకావ్యంలో చెప్పిన రామగిరి విదర్భదేశంలోనిదనీ, అతనిశైలి వైదర్భి అనీ అందువల్ల ఆ మహాకవి విదర్భ ప్రాంతీయుడని కొందఱు విమర్శకుల తలంపు. మేఘుని ద్వారా అలకాపురికి సందేశం పంపుతున్న యక్షుఁడు " ఓయి మేఘుఁడా! నీవెంత తొందరలో ఉన్నా, అడ్డదారిలోనైనా సరే వెళ్లి ఉజ్జయినీ పత్తనాన్ని దర్శించడం మర్చిపోకు. ఎందుకంటే ఉజ్జయినీ రమ్యహర్మ్యాలను, రమణీరమణీయ కటాక్షవీక్షణాలను చూడనివాని బ్రతుకు దండగ" అని హెచ్చరిస్తాఁడు. ఉజ్జయిని మీఁద ఇంత అనురాగం కలిగి ఉన్నాడు గనుక కాళిదాసు ఉజ్జయినికి చెందినవాఁడని మఱికొందఱి తలంపు. ఇలాగే విదిశా, మాళవ ప్రాంతాలతో ప్రగాఢ పరిచయం కలిగినవాఁడు కనుక ఆ ప్రాంతాలకు చెందినవాఁడని ఇంకొందఱి తలంపు. అయితే ఆ మహాకవి వర్ణించిన రామగిరి, గోదావరి మొదలయిన విశేషాలన్నీ ఇప్పటికీ మన ఆంధ్రదేశమునందలి కరీంనగరు జిల్లాలో సుస్పష్టంగా కనిపిస్తున్నాయి. కనుక ఇతఁడు మన తెలుగువాఁడే అనటానికి ఎక్కువ ఆస్కారముంది. మేఘసందేశకావ్యాన్ని తీసుకుని కరీనగరం వెళ్లి రామగిరిమీద కూర్చుని చదివితే మేఘుని ప్రయాణమార్గం చక్కఁగా అర్థమవుతుంది. దీనినిబట్టి కాళిదాసమహాకవి ఇక్కడ పుట్టిపెరిగి ఉజ్జయినీ ప్రాంతాదులకు వెళ్లి స్థిరపడ్డాఁడని, లేదా అక్కడ పుట్టి పెరిగిన కవి యిక్కడకు వచ్చి వెళ్లాడఁని భావించటానికి వీలుంది. ఏది యేమైనా కాళిదాసకవికి మన ఆంధ్రమహాసామ్రాజ్యంతోను, ఆంధ్రభాషతోను ఉన్న సంబంధం కాదనరానిది. ఆసక్తి కలిగిన పరిశోధకులు ఈ కోణంలో మఱింతలోఁతుగా పరిశీలించడం మంచిది.

## ఈ రఘువంశమహాకావ్యములో ఉన్న సర్గ లెన్ని?

కాళిదాసకవీశ్వరుఁడు రచించిన శ్రవ్యకావ్యత్రయమయిన కుమారసంభవ రఘువంశ మేఘసందేశ విషయంలోను, దృశ్యకావ్యత్రయమయిన విక్రమోర్వశీయ మాళవికాగ్నిమిత్ర అభిజ్ఞానశాకుంతల విషయంలోను విమర్శకశిఖామణులకు భేదాభిప్రాయం లేదు. ఋతుసంహారాది లఘుకృతుల విషయంలోను, మఱికొన్ని జ్యోతిశ్శాస్త్రగ్రంథాల విషయంలోను అభిప్రాయభేదా లున్నాయి. కొందఱు కొన్ని గ్రంథాలను విశ్వాసం కొద్దీ కాళిదాసునివిగా భావిస్తూ పఠిస్తున్నారు. పఠించటమనే మంచిపని చేస్తున్నారు గనుక ఇది సంతోషింపదగ్గ సంగతే.





ప్రస్తుతం ముద్రణరూపంలో మనకు లభిస్తున్న రఘువంశంలో 19 సర్గలున్నాయి. ఇంతటితో ఈ మహాకావ్యం ముగిసిందని చాలామంది భావిస్తున్నారు. కాని, కావ్యం మధ్యలో ఆగిపోయిందనే విషయం సూక్ష్మపరిశీలకులకు మాత్రమే తెలుస్తుంది. అలాంటి సూక్ష్మపరిశీలకులలో ఒకరైన శ్రీ S.V. Sohoni గారు The Spirit of India అనే గ్రంథముయొక్క రెండవ సంపుటంలో New Light on Kaalidaasa అనే వ్యాసాన్ని వెలుగులోనికి తెచ్చారు. ఈ సంపుటాలను Asia Publishing House, New York వారు 1976లో ప్రచురించారు. రెండవ సంపుటంలోని S.V. Sohoni గారి వ్యాసం 37వ పుటనుండి 51వ పుటవఱకు వ్యాపించి ఉంది. ఇంతేకాదు. దీని అనుబంధంలో कालिदासवृतान्तः అనే మూఁడుపుటల సంస్కృతవ్యాసాన్ని కూడా S.V. Sohoni గారు వ్రాసిన దానిని ప్రచురించారు. ఈ సంస్కృతవ్యాసం కాళిదాసునితండ్రి బ్రాహ్మణుఁడు, తల్లి వైశ్యకాంత - అనే వాక్యంతో ప్రారంభమయింది (कालिदासस्य पिता ब्राह्मणस्तस्थ माता वैश्यान्यभवत्) ఈ విషయ మటుంచుదాం.

సంస్కృతాంధ్రప్రాకృతాభిలాషి అయిన శ్రీమదిప్పగుంట సాయిబాబాగారు ఆ ఆంగ్లవ్యాసాన్ని, ఆ సంస్కృతవ్యాసాన్ని జిరాక్సు తీయించి నా చేతికిచ్చారు. అవి చదివి మనం చదువుతున్న రఘువంశమహాకావ్యం మధ్యలో ఆగిపోయిందని గ్రహించి బిత్తరపోయాను. పాఠకుల ప్రీతిని పెంచటానికి ఆ ఆంగ్లవాక్యాలను యథాతథంగా క్రింద పొందుపరుస్తున్నాను.

S.P. Pandit and V.V. Miroshi have reffered to a literary tradition that RAGHUVAMSA had more than nineteen chapters. According to what Pandit has ascertained, there were twenty five chapters and Mirashi has heard of twenty six chapters. If they really were there, the missing chapters have not yet been found; and it is very unlikely that they will be found in the future. If the tradition were even partly correct, what had followed chapter 19 is lost for ever. (Page 38).

.... Hemadri, who can easily be counted among the most erudite commentators of RAGHUVAMSA, observed, while commencing

his comments on chapter 19 of RAGHUVAMSA अथ रामायणादन्यदागमान्तरेण सर्गचतुष्टयं करोति [KALIDASA constructed his (remaining) four chapters by using materials from other standard works]. Incidentally, the literary tradition about RAGHUVAMSA having more than ninteen chapters does not appear to have been known to Hemadri. (Page 38)

".... Kumaragupta invited Kalidasa to compose a Mahakavya on his own descent from the Iksvaku race as the theme. Kalidasa accepted this request and composed the RAGHUVAMSA in twenty five cantos" (Page 49)

ఇంకా చాలా ఆసక్తికరవిషయాలు ఆ వ్యాసాలలో ఉన్నాయి. ఓపిక, కోరిక ఉన్న పాఠకులు వాటిని చదివి ఆనందించవచ్చు. ఈ సందర్భంలో నాకు ఆ వ్యాసాలనందించిన శ్రీసాయిబాబాగారికి కృతజ్ఞతాభివందనాలు!

## రామోరాగారి కృషి ప్రశంసనీయము

ఒక దశాబ్దకాలంనుంచి నాకు క్రొత్త సారస్వతమిత్రులు చేరువవుతున్నారు. వీరు సంస్కృతాంధ్రాలలో మంచి కృషిచేస్తున్న సాహితీకృషీవలులు. అయితే వీరు సంస్కృతాంధ్రాలలో చెప్పుకోఁదగిన డిగ్రీలు లేని (రామోరాగారు యమ్.ఎ సంస్కృతం కూడా చేశారు గనుక ఇందుకు మినహాయింపు.) వీరు సాహిత్యచర్చలలో పాల్గొంటే సంస్కృతాంధ్రశాఖలలో యమ్.ఏలు చేసినవారు గడగడలాడవలసిందే.

ఇతరశాఖలనుంచి వచ్చిన మిత్రులలో శ్రీరామోరాగారొకరు. జియాలజీ శాఖనుంచి సంస్కృతశాఖకువచ్చిన శ్రీమాన్ రావి మోహనరావు (రామోరా)గారు రెండుదశాబ్దాల కాలంనుంచి సంస్కృతాంధ్ర సాహిత్యాలకు చేస్తున్న సేవ అత్యుత్తమస్థాయికి చేరింది. ఇప్పటికి నూటపాతిక గ్రంథాలను అచ్చువేయించి లోకానికి అందించారు. వీటిలో కావ్యాలు, స్తోత్రకావ్యాలు, పురాణాలు. వేదాంతాలు, టీకాతాత్పర్యాదిసహితాలు వగైరాలు ఉన్నాయి. ఇంతే కాదు. స్వయంగా ఋతుసంహారమేఘసందేశ కుమారసంభవాలకు తెలుఁగు వ్యాఖ్యలు వ్రాసి అందించారు. మల్లినాథుని వ్యాఖ్యలతో పాటు మఱికొన్ని వ్యాఖ్యలను కూడా ఈ





తరంవారికి అచ్చురూపంలో అందించిన ఘనత వహించారు. బృహత్సంస్థలు చేయవలసినపనిని ఒంటిచేతి మీఁదుగా చేసి మాబోంట్లను పరమాశ్చర్యానికి గుఱిచేశారు. వివిధ పండితులచేత వీరు వ్యాఖ్యలు వ్రాయించి ప్రచురించిన గ్రంథరత్నాలు పలువురు సంస్కృతాంధ్రప్రియులకు ఆనందకాంతులు పంచుతున్నాయి. వీరు ప్రచురించిన గ్రంథాలన్నీ శ్రద్ధతో చదివినవారు పండితవర్గంలో చేరటం ఖాయం.

లోగడ కుమారసంభవానికి వ్రాసినట్లే రఘువంశానికి కూడా తెలుఁగు టీకాతాత్పర్యాలతోపాటు వ్యాకరణవిశేషాదులను కూడా చేర్చి తెలుఁగు జాతికి అందించడానికి శ్రీమోహనరావుగారు పూనుకోవడం ప్రశంసనీయం. విద్యార్థులు వీటిని నియమబద్ధంగా పఠించి పాండిత్యాన్ని పెంచుకోవచ్చు. పండితులు కూడా మర్చిపోయిన వ్యాఖ్యావిశేషాలను మరల పుస్తకంలోనికి తెచ్చుకోవచ్చు. మల్లినాథుల వారి వ్యాఖ్యలకే పరిమితమయిన పండితులు వల్లభదేవుని వ్యాఖ్యను కూడా ఈ గ్రంథంద్వారా పఠించి అర్థవిశేషాదులను గ్రహించవచ్చు. ధనవ్యయాన్ని లెక్కించని శ్రీరామోరాగారి పట్టుదలను ఇందుమూలంగా గమనించవచ్చు.

ఈవిధంగా ఈ రఘువంశప్రారంభసర్గకు నాచేత నాలుగుమాటలు సరదాగా వ్రాయించిన, సంస్కృతసేవావ్రతి అయిన శ్రీరావి మోహనరావుగారికి ధన్యవాదాలు సమర్పిస్తున్నాను. వీరి సేవావ్రతం నిరంతరంగా సాగేలా అనుగ్రహించాలని జగన్మాత అయిన భారతీదేవిని ప్రార్థిస్తున్నాను. అందఱం కలసి సంస్కృతాంధ్రసాహితీ సేవామార్గంలో పయనించుదాం.

శ్లో॥ కాళిదాసగిరాం సారం కాళిదాసః సరస్వతీ।
చతుర్ముఖోఽథవా సాక్షాద్విదుర్నాన్యే తు మాదృశాః॥

– శ్రీ మల్లినాథసూరి

కూకట్‌పల్లి (భాగ్యనగరము)
ది. 26-8-2013 సోమవారం
శ్రీవిజయ-శ్రావణ-బహుళ-పంచమి

**-డాక్టర్ వుయ్యూరు లక్ష్మీనరసింహారావు**
హైదరాబాద్ (కూకట్‌పల్లి)
చరవాణి 9573884358

శ్రీః

రఘువంశః - ప్రథమఃసర్గః

## విషయసూచికా









శ్రీః

శ్రీః

# రఘువంశః

## పఞ్చికాసంజీవినీటీకాద్వయోపేతః

## తైలఙ్గీమృణాళినీవ్యాఖ్యాసహితః చ

### ప్రథమః సర్గః

---

మాతాపితృభ్యాం జగతో నమో వామార్ధజానయే।
సద్యో దక్షిణదృక్పాతసంకుచద్వామదృష్టయే॥

అన్తరాయతిమిరోపశాన్తయే శాన్తపావనమచిన్త్యవైభవమ్।
తం నరం వపుషి కుఞ్జరం ముఖే మన్మహే కిమపి తున్దిలం మహః.॥

శరణం కరవాణి శర్మదం తే చరణం వాణి చరాచరోపజీవ్యమ్।
కరుణామసృణైః కటాక్షపాతైః కురు మామమ్బ కృతార్థసార్థవాహమ్॥

వాణీం కాణభుజీమజీగణదవాశాసీచ్చ వైయాసికీ –
మన్తస్తన్త్రమరంస్త, పన్నగగవీగుమ్ఫేషు చాజాగరీత్।
వాచామాచకలద్రహస్యమఖిలం యశ్చాక్షిపాదస్ఫురామ్
లోకేఽభూద్యదుపజ్ఞమేవ విదుషాం సౌజన్యజన్యం యశః॥





మల్లినాథః కవిః సోఽయం మన్దాత్మానుజిఘృక్షయా।
వ్యాచష్టే కాలిదాసీయం కావ్యత్రయమనాకులమ్॥

కాలిదాసగిరాం సారం కాలిదాసః సరస్వతీ।
చతుర్ముఖోఽథ వా సాక్షా ద్విదు ర్నా న్యే తు మాదృశాః॥

తథాపి దక్షిణావర్తనాథాద్యైః క్షుణ్ణవర్త్మసు।
వయం చ కాలిదాసోక్తిష్వవకాశం లభేమహి॥

భారతీ కాలిదాసస్య కువ్యాఖ్యావిషమూర్ఛితా।
ఏషా సంజీవినీ టీకా తామద్యోజ్జీవయిష్యతి॥

ఇహాన్వయముఖేనైవ సర్వం వ్యాఖ్యాయతే మయా।
నామూలం లిఖ్యతే కిఞ్చి న్నానపేక్షితముచ్యతే॥

ఇహ ఖలు సకలకవిశిరోమణిః కాలిదాసః–

‘కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే।
సద్యః పరనిర్వృతయే కాన్తాసమ్మితతయోపదేశయుజే॥

ఇత్యాద్యాలంకారికవచనప్రామాణ్యాత్ కావ్యస్యానేకశ్రేయఃసాధనతామ్, ‘కావ్యాలాపాంశ్చ వర్జయేత్’ ఇత్యస్య నిషేధశాస్త్రస్యాసత్కావ్యవిషయతాం చ పశ్యన్, రఘువంశాఖ్యం మహాకావ్యం చికీర్షుశ్చికీర్షితార్థావిఘ్నపరిసమాప్తిసంప్రదాయావిచ్ఛేదలక్షణఫలసాధనభూతవిశిష్టదేవతానమస్కారస్య శిష్టాచారప్రాప్తత్వాత్, ‘ఆశీర్నమస్క్రియావస్తునిర్దేశోవాఽపి తన్ముఖమ్’ ఇత్యాశీరాద్యన్యతమస్య ప్రబన్ధముఖలక్షణత్వాత్ కావ్యనిర్మాణస్య విశిష్టశబ్దార్థప్రతిపత్తిమూలకత్వేన, విశిష్టశబ్దార్థయోశ్చ

**‘శబ్దజాతమశేషం తు ధత్తే శర్వస్య వల్లభా।**
**అర్థరూపం యదఖిలం ధత్తే ముగ్ధేన్దుశేఖరః॥**

ఇతి వాయుపురాణసంహితావచనబలేన పార్వతీపరమేశ్వరాయత్తత్వదర్శనాత్, తత్ప్రతిపిత్సయా తా వే వాభివాదయతే। –

---

## 'వశిష్ఠాశ్రమాభిగమనో' నామ ప్రథమః సర్గః

**అవతారిక :-** 'ఆశీర్నమస్క్రియా వస్తునిర్దేశో వాపి తన్ముఖమ్' అను శాస్త్ర నియమానుసారము నమస్కారరూపమగు మంగళముతో కావ్యమును ప్రారంభము చేయదలచి, శబ్దార్థములకు 'శబ్దజాతమశేషం తు ధత్తే శర్వస్య వల్లభా అర్థరూపం యదఖిలం ధత్తే ముగ్ధేన్దుశేఖరః' అను వాయుపురాణవచనముచేత పార్వతీపరమేశ్వరులను ఆ విశిష్టశబ్దార్థముల సమ్యగ్ జ్ఞానమును పొందుటకై మహాకవి కాళిదాసు వారికి నమస్కరించుచున్నాడు.

**శ్లో॥ వాగర్థావివ సమ్పృక్తౌ**
**వాగర్థప్రతిపత్తయే।**
**జగతః పితరౌ వన్దే**
**పార్వతీపరమేశ్వరౌ॥ 1**

**పదవిభాగము :-** వాగర్థావివ, సమ్పృక్తౌ, వాగర్థప్రతిపత్తయే, జగతః, పితరౌ, వన్దే, పార్వతీపరమేశ్వరౌ।

**అన్వయక్రమము :-** వాగర్థావివ సమ్పృక్తౌ జగతః పితరౌ పార్వతీపరమేశ్వరౌ వాగర్థప్రతిపత్తయే వన్దే।

**ప్రతిపదార్థము :-** వాగర్థావివ = వాక్ చ అర్థశ్చ ఇతి వాగర్థౌ, వాగర్థౌ ఇవ ఇతి వాగర్థావివ - శబ్దము, అర్థమువలె; సమ్పృక్తౌ = నిత్యసంబంధముకలవారును, జగతః = లోకమునకు, పితరౌ = తల్లిదండ్రులైన వారగు, పార్వతీపరమేశ్వరౌ = పార్వతీపరమేశ్వరులను, వాగర్థప్రతిపత్తయే = శబ్దార్థములయొక్క జ్ఞానము కొఱకు, వన్దే = నమస్కరించుచున్నాను.

**తాత్పర్యము :-** శబ్దార్థములవలె నిత్యసంబంధముకలవారును, లోకమునకు తల్లిదండ్రులైన వారును అగు పార్వతీపరమేశ్వరులను శబ్దార్థములయొక్క జ్ఞానముకొఱకు నమస్కరించుచున్నాను.

**విభక్తులు - క్రియలు :-** 1. వాగర్థావివ - వాగర్థసదృశౌ - వాగర్థావివ; అవ్యయమ్। 2. సమ్పృక్తౌ - సమ్పృక్తమ్ - **సమ్పృక్తౌ** - సమ్పృక్తాన్; సమ్పృక్తశబ్దః, అకారాన్తః పుల్లిఙ్గః ద్వితీయాద్వివచనాంతః। సం పృచ్ క్తః। 3. వాగర్థప్రతిపత్తయే - **వాగర్థప్రతిపత్త్యై / వాగర్థప్రతిపత్తయే** - వాగర్థప్రతిపత్తిభ్యామ్ - వాగర్థప్రతిపత్తిభ్యః; వాగర్థప్రతిపత్తిశబ్దః, ఇకారాన్తః స్త్రీలిఙ్గః చతుర్థ్యేకవచనాన్తః। 4. జగతః - **జగత,** జగతోః, జగతామ్; జగచ్ఛబ్దః, తకారాన్తః నపుంసకలిఙ్గః షష్ఠ్యేకవచనాన్తః। 5. పితరౌ - పితరం - **పితరౌ** - పిత్రూన్; పితృశబ్దః, ఋకారాన్తః పుల్లిఙ్గః ద్వితీయాద్వివచనాన్తః। 6. వన్దే - ఉత్తమపురుషైకవచనాన్తః। క్రియాపదమ్। 7. పార్వతీపరమేశ్వరౌ - పార్వతీపరమేశ్వరశబ్దః, అకారాన్తః పుల్లిఙ్గః నిత్యద్వివచనే ద్వితీయాద్వివచనాన్తః





**సమాసాలు :-**

1. ఇవ సమాసః వాగర్థావివ - వాగర్థౌ ఇవ।
2. వాగర్థప్రతిపత్తయే - వాక్ చ అర్థశ్చ - వాగర్థౌ (ద్వంద్వసమాసః) వాగర్థయోః ప్రతిపత్తిః వాగర్థప్రతిపత్తిః, (ష.త.), తస్యై।
3. పితరౌ - మాతా చ పితా చ-పితరౌ - 'పితా మాత్రా' ఇతి ద్వంద్వైకశేషః। తౌ।
4. పార్వతీపరమేశ్వరౌ - పరమః చ అసౌ ఈశ్వరశ్చ - పరమేశ్వరః (వి.పూ.క.) పార్వతీ చ పరమేశ్వరశ్చ - పార్వతీపరమేశ్వరౌ (ద్వంద్వ), తౌ।

**సంధులు :-**

1. వాగర్థావివ - వాక్ + అర్థౌ + ఇవ - వాగర్థౌ + ఇవ - వాగర్థావివ।

ఎ) వాక్ + అర్థౌ - వాగర్థౌ - జశ్త్వమ్ - ఝలాం జశోఽన్తే (సూ 8-2-39)

బి) వాగర్థౌ + ఇవ - వాగర్థావివ - **ఏచోఽయవాయావః** (సూ 6-1-78)

ఏ ఓ ఐ ఔ లకు అచ్చుపరముగానున్నప్పుడు క్రమముగా అయ్, అవ్, ఆయ్, ఆవ్ అనునవి ఆదేశముగా వచ్చును.

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు :-**

**1. వాగర్థౌ :-**

ఎ) ఒకదానితో మఱియొక దానికి నెడబాటు లేనివి వాగర్థములు

'ఔత్పత్తికస్తు శబ్దస్యార్థేన సమ్బన్ధ ఇతి వాగర్థయోః నిత్యసంబంధిత్వం ప్రసిద్ధమ్'. (చిత్రమీమాంస) వాగర్థములవలెనే పార్వతీపరమేశ్వరులును నిత్య సంబంధము గలవారు.

బి) మన్త్రశాస్త్రమందును వాగర్థములకు నిత్యసంబంధము, శివశక్తిమయత్వము నిరూపించబడినది. శివశక్తులు సంవిద్బిందురూపులనియును, నిత్యయుతులనియును స్పష్టము చేయబడినది.

శ్లో॥ **వాగర్థౌ** నిత్యయుతౌ పరస్పరం శక్తిశివమయావేతౌ।
సృష్టిస్థితిలయభేదౌ త్రిధా విభక్తౌ త్రిబీజరూపేణ॥

కామకళావిలాసము –12

'వాగర్థా' వితి – వాగర్థౌ – వాక్ –వర్ణపదమన్త్రరూపా। అర్థ – కలాతత్త్వభువనాత్మా। అత ఏవ తద్రూపౌ। కుతః? విమర్శ ప్రకాశాత్మకశబ్దార్థాభ్యామేవ షడధ్వాత్మక సర్వప్రపంచోత్పత్తి శ్రవణాత్। తథా, శ్రీవిరూపాక్షపంచాశికాయామ్।

శ్లో॥ యస్య విమర్శస్య కణః పదమన్త్రవర్ణాత్మకస్త్రిధా శబ్దః।
భువనకళాతత్త్వోఽర్థో ధర్మిణ ఇత్థం ప్రకాశస్య। ఇతి.

అత ఏవ, **నిత్యయుతౌ** – నిరంతరసంసక్తౌ। నహి ఘటపటయోరివ కాదాచిత్కః సమ్బన్ధః। తథాసతి, సర్వానుపపత్తి ప్రసంగాత్। పరస్పరం **శివశక్తిమయౌ** – ప్రకాశవిమర్శస్వరూపౌ। ఉభయోరేకకృత్యత్వాత్, వహ్నిదాహకవత్। తత్త్వాన్తరం న భవతీత్యర్థః। తథా చాగమః

శ్లో॥ అవయోర్జగదాత్మత్వాత్తాదాత్మ్యం చానయోరపి।
తాదాత్మ్యాదావయోర్నిత్యం జగత్ప్రాణావుభౌ హి నౌ॥

ఇత్యాది అభియుక్తోరపి – "తాదాత్మ్యమనయోర్నిత్యం, వహ్నిదాహకయోరివ" ఇతి। ఇంకను,

పార్వతీపరమేశ్వరులు జగమునకు మాతాపితరులు.

నిరతిశయప్రేమశాలిత్వము – మహామహిమత్వము – అభిలషితార్థప్రదాన సామర్థ్యము – పరమకారుణికత్వము – మున్నగునవి యనేకములు ధ్వనితములు.

సి)అమృతబీజమైన 'వ' కారముతో ఈ కావ్యమారంభింపబడినందున ఇది శుభప్రదము.

డి) Mallinatha says that 'వాగర్థావివ' should be taken as a compound word and quotes 'పతంజలి' in favour of his view. Now the passage ఇవేన సహ సమాసః etc, strictly speaking, applies only to vedic forms (as this expression పూర్వపదప్రకృతిస్వరత్వం clearly shows) and it is unfair to extend its application to classical literature. In the Vedic pada text, the form హోతేవ, for instance, is shown as హోతాఽ ఇవ



and this must have led to its being taken as a compound word...
- karmarkar.

ఇ) కావ్యాది 'అక్షర' మఱియు 'గణ' ప్రాశస్త్యమును గూర్చి 'ఆంధ్రవిశ్వవిద్యాలయము' వారు ప్రచురించిన 'చమత్కారచన్ద్రిక' ను ఇచట అనుసంధానము చేసికొనదగును.

శ్లో॥ యథోచితమిమే వర్ణా రసాదేరుపయోగినః।
న్యస్తా కావ్యముఖే వర్ణాస్తత్తద్దైవతమూర్తయః॥ 1–18

శ్లో॥ కర్తుః కారయితః శ్రోతుః కల్పయన్తి శుభాశుభే।
అ(ఆ) కారః ప్రీతిదాయీ స్యాన్నిషేధే తు విపర్యయః॥ 1–19

శ్లో॥ అస్త్యుత్తరస్యాం వాగర్థౌ కశ్చిత్కాన్తేత్యుదాహృతిః।
కాళిదాసత్రయే (యో) జ్ఞేయా శుభయోర్గణవర్ణయోః॥ 1–39

శ్లో॥ అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా హిమాలయో నామ నగాధిరాజః।
పూర్వాపరౌ తోయనిధీ వగాహ్య స్థితః పృథివ్యా ఇవ మానదణ్డః॥
– కు.సం. 1.1

శ్లో॥ **వాగర్థావివ** సమ్పృక్తౌ వాగర్థప్రతిపత్తయే।
జగతః పితరౌ వన్దే పార్వతీపరమేశ్వరౌ॥ – ర.వం 1–1

శ్లో॥ కశ్చిత్కాన్తా విరహగురుణా స్వాధికారాత్ప్రమత్తః...
స్నిగ్ధచ్ఛాయాతరుషు వసతిం రామగిర్యాశ్రమేషు॥ – మే.దూ. 1–1

ఎఫ్) 'వాగర్థావివ' is a compound word and not, as some might be led to think two words. **'వాగర్థౌ'** by itself cannot be syntactically connected either with **వన్దే** or with **పితరౌ.** Mallinatha rightly considers the two words **వాగర్థౌ** and **ఇవ** as forming an adverbial compound (అవ్యయసమాస) modifying the sense of సమ్పృక్తౌ.

Secondly there are numerous instances in the Raghuvamsa itself which show that the compound with **ఇవ** is optional and not **నిత్య**; e.g., ఉద్బాహురివ వామనః; The text of Mallinatha, therefore, has been corrected accordingly. - Kale.

జి) ఇట 'కుమారసంభవమహాకావ్యం - 6-79' వ శ్లోకవ్యాఖ్యానభాగము మఱికొంత వివరము కొఱకు చూడదగును. - కు.సం మృణాళినీవ్యాఖ్య

హెచ్) ఈ దిగువ చూపబడిన శ్లోకమును చూడుడు.

**శ్లో॥ "ప్రభార్యావివ సమ్పృక్తౌ భవభీతినివృత్తయే।**
**రక్షితారౌ త్రిజగతాం లక్ష్మీనారాయణౌ భజే॥"**

- దివ్యసూరిచరితమ్ - 1-1

**క్రియాదర్శము :-** 1. వన్దే - **వన్దే** - వన్దావహే - వన్దామహే। 'వది' అభివాదనస్తుత్యోః, ఇత్యస్మాద్ధాతోస్సకర్మకాత్కర్తరి వర్తమానే లటి ఆత్మనేపదే ఉత్తమపురుషైకవచనాన్తః। మయా జగతః పితరౌ వన్ద్యేతే। కర్మణిప్రయోగః।

శ్లో॥ **వన్దే** శంభుముమాపతిం సురగురుం **వన్దే** జగత్కారణం
**వన్దే** పన్నగభూషణం మృగధరం **వన్దే** పశూనాం పతిమ్।
**వన్దే** సూర్యశశాఙ్కవహ్నినయనం **వన్దే** ముకున్దప్రియం
**వన్దే** భక్తజనాశ్రయం చ వరదం **వన్దే** శివం శఙ్కరమ్॥

**అలంకారములు :-** అత్ర ఉపమాలంకారః। తల్లక్షణం యథా చంద్రాలోకే -

**'ఉపమా యత్ర సాదృశ్యలక్ష్మీరుల్లసతి ద్వయోః।**

ఉపమానమునకు ఉపమేయమునకు - ఈ రెండింటికి సామ్యరూపమైన సౌందర్యము సహృదయరంజకముగా నెచ్చటనుండునో, అచ్చట నది ఉపమాలంకార మగునని లక్షణము. ఇట

ఉపమానము - వాగర్థములు, ఉపమేయము - పార్వతీపరమేశ్వరులు, సామ్యము - సంపృక్తత్వము, వాచకము - ఇవ.

**ఛందస్సు :-** ఈ సర్గమునందలి శ్లోకములు 'అనుష్టుప్' ఛందస్సునందు కూర్పబడినవి.

**లక్షణము :-**

**శ్లోకే షష్ఠం గురు జ్ఞేయం సర్వత్ర లఘు పఞ్చమమ్।**
**ద్విచతుష్పాదయోర్హ్రస్వం సప్తమం దీర్ఘమన్యయోః॥**

There are several varietes of this metre, but that which is most in use has eight syllables in each quarter, but of variable

10



quantity. Thus the fifth syllable of each quarter should be short, the sixth long and the seventh alternately long and short.

**సంజీవినీ :-** వాగర్థావితి. - వాగర్థావివేత్యేకం పదమ్. ఇవేన సహ నిత్యసమాసో విభక్త్యలోపశ్చ పూర్వపద ప్రకృతిస్వరత్వం చేతి వ్యక్తవ్యమ్ - ఏవ మన్యత్రాపి ద్రష్టవ్యమ్ - వాగర్థావివ శబ్దార్థావివ, సంపృక్తౌ - నిత్యసంబద్ధావి త్యర్థః - నిత్యసంబద్ధయో రుపమాన త్వే నో పాదానాత్. 'నిత్యః శబ్దార్థసంబన్ధ' ఇతి మీమాంసకాః, జగతో లోకస్య, పితరౌ - మాతా చ పితా చ పితరౌ. 'పితా మాత్రా' ఇతి ద్వన్ద్వైకశేషః 'మాతా పితరౌ పితరౌ మాతరపితరౌ ప్రసూజనయితారౌ' ఇత్యమరః - ఏతేన శర్వశివయోః సర్వజగజ్జనకతయా వైశిష్ట్యమిష్టార్థప్రదానశక్తిః పరమకారుణికత్వం చ సూచ్యతే, పర్వతస్యాపత్యం స్త్రీ పార్వతీ. 'తస్యాపత్యమ్' ఇత్యణ్ 'టిడ్ఢాణఞ్ - ' ఇత్యాదినా జీప్ - పార్వతీ చ పరమేశ్వర శ్చ పార్వతీపరమేశ్వరౌ - పరమశబ్దః సర్వోత్తమత్వద్యోతనార్థః మాతుర భ్యర్హితత్వా దల్పాన్తరత్వా చ్చ పార్వతీశబ్దస్య పూర్వనిపాతః, వాగర్థప్రతిపత్తయే శబ్దార్థయోః సమ్యగ్ జ్ఞానార్థం, వన్దేఽభివాదయే.

అత్రోపమాలంకారః స్ఫుట ఏవ - తథోక్తమ్. -

**'స్వతఃసిద్ధేన భిన్నేన సమ్పన్నేన చ ధర్మతః**
**సామ్యమన్యేన వర్ణ్యస్య వాచ్యం చేదేకగోపమా.' ఇతి;**

ప్రాయిక శ్చోపమాలంకారః కాలిదాసోక్తకావ్యాదౌ. భూదేవతాకస్య సర్వగురోర్మగణస్య ప్రయోగా చ్ఛుభలాభః సూచ్యతే - తదుక్తమ్. 'శుభదో మో భూమిమయః' ఇతి. వకారస్యామృతబీజత్వాత్ ప్రచయగమనాదిసిద్ధిః.

---

**అవతారిక :-** సంప్రతి కవిః స్వాహంకారం పరిహరతి 'క్వ సూర్యప్రభవః' - ఇత్యాది శ్లోకద్వయేన -

**శ్లో॥ క్వ సూర్యప్రభవో వంశః**
**క్వ చాల్పవిషయా మతిః।**
**తితీర్షుర్దుస్తరం మోహా-**
**దుడుపేనాస్మి సాగరమ్॥** **2**

**పదవిభాగము :-** క్వ, సూర్యప్రభవః, వంశః, క్వ, చ, అల్పవిషయా, మతిః, తితీర్షుః దుస్తరమ్, మోహాత్, ఉడుపేన, అస్మి, సాగరమ్.

**అన్వయక్రమము :-** సూర్యప్రభవః వంశః క్వ; అల్పవిషయా మతిః చ క్వ, దుస్తరం సాగరం మోహాత్ ఉడుపేన తితీర్షుః అస్మి।

**ప్రతిపదార్థము :-** సూర్యప్రభవః - సూర్యుడే మూలకారణముగా గలిగిన, వంశః - వంశము, క్వ - ఎక్కడ?, అల్పవిషయా - స్వల్పములైన తెలియదగిన విషయముగలిగిన, మతిః + చ - బుద్ధియును, క్వ - ఎక్కడ? దుస్తరమ్ - దాటశక్యముగాని, సాగరమ్ - సముద్రమును, మోహాత్ - అజ్ఞానమువలన, ఉడుపేన - తెప్పచేత, తితీర్షుః - దాటగోరువాడను, అస్మి - అగుచున్నాను.

**తాత్పర్యము :-** మహత్తరమగు సూర్యవంశమెక్కడ? అల్పజ్ఞుడనైన నేనెక్కడ? అజ్ఞానమువలన దాటుటకు శక్యముగాని సముద్రమును చిన్నతెప్పచేత దాటగోరు వాడనగుచున్నాను.

**విభక్తులు / క్రియలు :-** 1. క్వ - అవ్యయమ్, క్రియావిశేషణమ్। 2. సూర్యప్రభవః - **సూర్యప్రభవః**, సూర్యప్రభవౌః, సూర్యప్రభవాః; సూర్యప్రభవశబ్దః అకారాన్త పుల్లిఙ్గ ప్రథమైకవచనాన్తః। 3. వంశః - **వంశః**, వంశౌ, వంశాః; వంశశబ్దః అకారాన్తః పుల్లిఙ్గ ప్రథమైకవచనాన్తః। 4. చ - అవ్యయమ్। 5. అల్పవిషయా - **అల్పవిషయా,** అల్పవిషయే, అల్పవిషయాః; అల్పవిషయాశబ్దః ఆకారాన్తః స్త్రీలిఙ్గః ప్రథమైకవచనాన్తః 6. మతిః - **మతిః**, మతీ - మతయః; మతిశబ్దః ఇకారాన్తః స్త్రీలిఙ్గః ప్రథమైకవచనాన్తః 7. తితీర్షుః - **తితీర్షుః**, తితీర్షూ, తితీర్షవః; తితీర్షుశబ్దః ఉకారాన్తః పుల్లిఙ్గః ప్రథమైక వచనాన్తః। 8. దుస్తరమ్ - **దుస్తరమ్**, దుస్తరౌ, దుస్తరాన్; దుస్తరశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః ద్వితీయైకవచనాన్తః। 9. మోహాత్ - **మోహాత్**, మోహాభ్యామ్, మోహేభ్యః ; మోహశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః పఞ్చమ్యేకవచనాన్తః। 10. ఉడుపేన -**ఉడుపేన,** ఉడుపాభ్యామ్, ఉడుపైః; ఉడుపశబ్దః అకారాన్తః నపుంసకలిఙ్గః తృతీయైకవచనాన్తః । 11. అస్మి-ఉత్తమపురుషైకవచనాన్తః। క్రియాపదమ్ 12. సాగరమ్ - **సాగరమ్,** సాగరౌ, సాగరాన్; సాగరశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః ద్వితీయైకవచనాన్తః।

**సమాసాలు :-**

1. సూర్యప్రభవః - సూర్యః ఏవ ప్రభవః యస్య సః - సూర్యప్రభవః - బహువ్రీహిసమాసః।



2. అల్పవిషయా - అల్పః విషయః యస్యాః సా - అల్పవిషయా - (బ.స.)।
3. తితీర్షుః - తరితుమిచ్ఛుః తితీర్షుః అస్మి తరతేస్సన్నంతాదుప్రత్యయః।

**సంధులు :-**

1. 1. చ + అల్పవిషయా - చాల్పవిషయా, సవర్ణదీర్ఘసన్ధిః।

**అకః సవర్ణే దీర్ఘః** (సూ 6-1-97), అ ఇ ఉ ఋ (అక్కులకు) వర్ణములకు (హ్రస్వ దీర్ఘములకు) సవర్ణమగు అచ్చు పరమగునపుడు పూర్వపరముల స్థానములో సవర్ణదీర్ఘము ఏకాదేశమగును.

2. తితీర్షుః + దుస్తరమ్ - తితీర్షుర్దుస్తరమ్ - విసర్గసన్ధిః। (రుత్వమ్)
3. ఉడుపేన + అస్మి - ఉడుపేనాస్మి - సవర్ణదీర్ఘసన్ధిః।
4. మోహాత్ + ఉడుపేన - మోహాదుడుపేన - జశ్త్వమ్।

**ఝలాం జశోఽన్తే** (సూ 8-2-39)

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు :-**

**1. క్వ - క్వ -**

ఎ) When repeated in co - ordinate sentences imply 'great differenc' or incongruity.

బి) శ్లో॥ **క్వ** రుజా హృదయప్రమాథినీ **క్వ** చ తే విశ్వసనీయమాయుధమ్।
మృదు తీక్ష్ణతరం యదుచ్యతే తదిదం మన్మథ! దృశ్యతే త్వయి॥
- మాలవికాగ్నిమిత్రమ్ -3-2

'నా హృదయమును బాధించు ఈ బాధ ఎక్కడ? విశ్వసనీయమైన నీ యాయుధమెక్కడ?.........'

2. **మహాకవి భారవి** రచించిన **కిరాతార్జునీయమహాకావ్యమున** ప్రథమసర్గము - 6వ శ్లోకమును చూడండి.

శ్లో॥ నిసర్గదుర్బోధమబోధవిక్లబాః
**క్వ** భూపతీనాం చరితం **క్వ** జన్తవః।
తవానుభావోఽయమవేది యన్మయా
నిగూఢతత్త్వం నయవర్త్మ విద్విషామ్॥

...మహారాజులచరిత్ర ఎక్కడ? నా బోటి మందబుద్ధులెక్కడ?.....

3. మహాకవికాళిదాసు రచించిన 'అభిజ్ఞానశాకున్తలమ్' నాటక ద్వితీయాంకాంత శ్లోకమును చూడండి.

శ్లో॥ **క్వ** వయం **క్వ** పరోక్షమన్మథో మృగశాబైస్సమమేధితో జనః।
పరిహాసవిజల్పితం సఖే! పరమార్థేన న గృహ్యతాం వచః॥

చెలికాడా! రాజాధిరాజులమగు మేము ఎక్కడ? అడవియందు పెరిగిన ఆ తాపసకాంత ఎక్కడ?........

4. అద్వితీయబ్రహ్మతత్త్వం న జానన్తి యథా తథా।
భ్రాన్తా ఏవాఖిలాస్తేషాం **క్వ** ముక్తిః **క్వేహ** వా సుఖమ్॥

– వరాహోపనిషత్తు 2అ

5. **క్వ** సుధా **క్వ** కథా లోకే **క్వ** కాచః **క్వ** మణిర్మహాన్।
బ్రహ్మరాతో విచార్యైవం తదా దేవాన్ జహాస హ॥ – భాగవతమ్ 1-16

6. **క్వ** తావానానన్దో..... విరమతి॥ –ఉ.రా. 6-33

7. **క్వ** చ నరపతిగర్వః సంగ్రహః **క్వ** ప్రజానామ్...

– కామందకీయనీతిసారే 3-40

**అలంకారాలు :–** అత్ర నిదర్శనాలంకారః। తల్లక్షణం యథా కావ్యప్రకాశే

కా – నిదర్శనా

అభవన్ వస్తుసంబన్ధ ఉపమాపరికల్పకః।

వృ – నిదర్శనం దృష్టాన్తకరణమ్। అత్ర ఉడుపేన సాగరతరణమివ మన్మత్యా సూర్యవంశవర్ణనమిత్యుపమాయాం పర్యవస్యతి.

ఎ) అత్రేతి – ఇక్కడ 'నా మతిచేత సూర్యవంశాన్ని వర్ణించడం తెప్పచేత సముద్రాన్ని దాటడం వంటిది' అని ఉపమలో పర్యవసానం చెందుతున్నది.

నిదర్శనమితి – నిదర్శనమనగా దృష్టాన్తముగా చూపడం. అది దీనిలో ఉంటుంది గనుక దీనికి **నిదర్శన** అని పేరు. ఈ అలంకారములో చెప్పిన వస్తుసంబంధము కుదరకపోవడం చేత ఆ రెండింటికి ఉపమానోపమేయభావము కల్పించడం జరుగుతుంది. దృష్టాన్తాలంకారములో కుదరకపోవడం అనేది ఉండదు. ఈ రెండింటికి అదే భేదం.





ఇట సూర్యవంశాన్ని వర్ణించే సందర్భంలో 'నేను సాగరాన్ని దాటాలని అనుకుంటున్నాను' అని సాగరతరణసంబంధాన్ని చెప్పడం అసంగతము. అందుచేత ఇది ఉడుపముతో సాగరతరణంవలె నామతితో సూర్యవంశవర్ణనం అసంభావ్యం అని ఉపమను కల్పిస్తూన్నది కనుక ఇది **వాక్యార్థనిదర్శన.** – బాలానందినీ.

బి) ఈ శ్లోకమునందలి యలంకారము 'లలితాలంకారము'అని కువలయానందము. తల్లక్షణం యథా –

శ్లో॥ వర్ణ్యే స్యాద్వర్ణ్యవృత్తాన్తప్రతిబిమ్బస్య వర్ణనం లలితమ్।
ప్రస్తుతే ధర్మిణి యో వర్ణనీయో వృత్తాన్తస్తమవర్ణయిత్వా॥

తత్రైవ తత్ప్రతిబిమ్బరూపస్య కస్యచిత్ అప్రస్తుతవృత్తాన్తస్య వర్ణనం లలితమ్. అత్రాపి నిదర్శనాభ్రాన్తిర్న కార్యా। అల్పవిషయయా మత్యా సూర్యవంశం వర్ణయితుమిచ్ఛురహమితి ప్రస్తుతవృత్తాన్తానుపన్యాసాత్ తత్ప్రతిబింబభూతస్య 'ఉడుపేన సాగరం తితీర్షురస్మి' ఇతి అప్రస్తుతవృత్తాన్తస్య వర్ణనేన' ఆదౌ విషమాలంకారవిన్యసనేన చ కేవలం తత్ర తాత్పర్యస్య గమ్యమానత్వాత్'। అని, ఈ మతమును 'రసగంగాధర' కారులు ఖండించి 'లలితాలంకారము' నిదర్శనలోనే అంతర్భూతమని, దానిని ప్రత్యేకాలంకారమునుగా గ్రహింపరాదని, అట్లుగానిచో, లుప్తోపమను సైతము ప్రత్యేకాలంకారముగా గ్రహింపవలసియుండునని, అది, యే యలంకారికునకు సమ్మతము కాదని సవిమర్శముగా నిరూపించినారు.

– శ్రీకాళిదాసకవితావైభవమునుండి

**క్రియాదర్శము :–** 1. అస్మి – 'అస' భువి, ఇత్యస్మాద్ధాతోరకర్మకాత్కర్తరి వర్తమానే లటి పరస్మైపదీ ఉత్తమపురుషైకవచనాన్తః।

**అస్మి** – స్వః – స్మః

శ్లో॥ **క్వ** దివ్యసూరిచరితం **క్వ** చ మే మన్దశేముషీ।
నియన్తుకామో**ఽస్మి** గజం సాహసాద్బిసతన్తునా॥

– దివ్యసూరిచరితమ్ 1-2

**సంజీవినీ :–** క్వ సూర్యేతి. – ప్రభవ త్యస్మా దితి ప్రభవః కారణమ్. 'ఋదోరప్'. 'అకర్తరి చ కారకే సంజ్ఞాయామ్' ఇతి సాధుః – సూర్యః ప్రభవో యస్య స సూర్యప్రభవో, వంశః, క్వ అల్పో విషయో జ్ఞేయోఽర్థో యస్యాః సా మే మతిః

ప్రజ్ఞా చ క్వ - ద్వౌ క్వ శబ్దౌ మహద న్తరం సూచయతః - సూర్యవంశ మాకలయితుం న శక్నో మీత్యర్థః - తథా చ తద్విషయప్రబన్ధనిరూపణం తు దూరాపాస్త మితి భావః; తథా హి - దుస్తరం తరితు మశక్యమ్. 'ఈషద్దుఃసుషు- ' ఇత్యాదినా ఖల్ప్రత్యయః, సాగరం, మోహాదజ్ఞానాదుడుపేన ప్లవేన. 'ఉడుపం తు ప్లవః కోలః' ఇత్యమరః - అథవా చర్మావనద్ధేన పానపాత్రేణ' 'చర్మావనద్ధ ముడుపం ప్లవః కాష్ఠం కరణ్డవత్' ఇతి సజ్జనః, తితీర్షు స్తరితు మిచ్ఛు, రస్మి భవామి. తరతేః సన్నన్తాదుప్రత్యయః - అల్పసాధనై రధికారమ్భో న సుకర ఇతి భావః. ఇదం చ వంశోత్కర్షకథనం స్వప్రబన్ధమహత్త్వార్థమేవ, తదుక్తమ్. 'ప్రతిపాద్యమహిమ్నా చ ప్రబన్ధో హి మహత్తరః' ఇతి.

---

**శ్లో॥ మన్దః కవియశఃప్రార్థీ**
**గమిష్యామ్యుపహాస్యతామ్।**
**ప్రాంశులభ్యే ఫలే లోభా-**
**దుద్బాహురివ వామనః॥ 3**

**పదవిభాగము :-** మన్దః, కవియశఃప్రార్థీ, గమిష్యామి, అపహాస్యతామ్, ప్రాంశులభ్యే, ఫలే, లోభాత్, ఉద్బాహుః, ఇవ, వామనః।

**అన్వయక్రమము :-** మన్దః కవియశఃప్రార్థీ ప్రాంశులభ్యే ఫలే లోభాత్ ఉద్బాహుః వామనః ఇవ అపహాస్యతాం గమిష్యామి।

**ప్రతిపదార్థము :-** మన్దః - మూఢుడనైనను, కవియశఃప్రార్థీ - కవులయొక్క కీర్తిని కోరునట్టివాడనై, ప్రాంశులభ్యే - పొడగరిచే పొందదగిన, ఫలే - పండునందు, లోభాత్ - ఆశవలన, ఉద్బాహుః - పైకి ఎత్తబడిన హస్తముగల, వామనః ఇవ - పొట్టివానివలె, అపహాస్యతామ్-ఎగతాళిని/నగుబాటును, గమిష్యామి- పొందగలను.

**తాత్పర్యము :-** మూఢుడనయ్యును వాల్మీకాదుల కవులకీర్తిని పొందగోరునట్టివాడనై పొడగరిచే పొందదగిన పండునందు ఆశవలన చేయెత్తిన పొట్టివానివలె నగుబాటును పొందగలను.

**విభక్తులు / క్రియలు :-** 1. మన్దః - **మన్దః**, మన్దౌ, మందాః; మన్దశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః ప్రథమైకవచనాన్తః। 2. కవియశఃప్రార్థీ - **కవియశఃప్రార్థీ**, కవియశఃప్రార్థినౌ,





కవియశఃప్రార్థినః; కవియశఃప్రార్థిన్‌శబ్దః నకారాన్తః పుల్లిఙ్గ ప్రథమైకవచనాన్తః। 3. గమిష్యామి - ఉత్తమపురుషైకవచనాన్తః, క్రియాపదమ్। 4. అపహాస్యతామ్ - **అపహాస్యతామ్**, అపహాస్యతే, అపహాస్యతాః; అపహాస్యతాశబ్దః ఆకారాన్తః స్త్రీలిఙ్గః ద్వితీయైకవచనాన్తః। 5. ప్రాంశులభ్యే - **ప్రాంశులభ్యే,** ప్రాంశులభ్యయోః, ప్రాంశులభ్యేషు; ప్రాంశులభ్యశబ్దః అకారాన్తః నపుంసకలిఙ్గః సప్తమ్యేకవచనాన్తః। 6. లోభాత్ - **లోభాత్**, లోభాభ్యామ్, లోభేభ్యః; లోభశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః పఞ్చమ్యేకవచనాన్తః। 7. ఉద్బాహుః - **ఉద్బాహుః,** ఉద్బాహూ, ఉద్బాహవః; ఉద్బాహుశబ్దః ఉకారాన్తః పుల్లిఙ్గః ప్రథమైకవచనాన్తః। 8. ఇవ - అవ్యయమ్ 9. వామనః - **వామనః,** వామనౌ, వామనాః; వామనశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః ప్రథమైకవచనాన్తః।

**సమాసాలు :-**

1. కవియశః ప్రార్థీ - కవీనాం యశః, కవియశః (ష.త.); కవియశః ప్రార్థయతి ఇతి కవియశఃప్రార్థీ - కృ.వృ.
   కవియశఃప్రార్థీ - కవయన్తీతి కవయః, తేషాం యశః కవియశః (ష.త.), తత్ ప్రార్థయితుం శీలమ్ అస్య సః (బహువ్రీహిః)।
2. ప్రాంశులభ్యే - ప్రాంశునా లభ్యమ్, ప్రాంశులభ్యమ్ (తృ.త.) తస్మిన్।
3. ఉద్బాహుః - ఉత్ (గతౌ) బాహూ యస్య సః, ఉద్బాహుః (బ.)।

**పాఠాన్తరాలు :-**

1. లభ్యే - లంఘ్యే 2. ఉపహాస్యతామ్ - అపహాస్యతామ్ - అవహాస్యతామ్.

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు :-**

1. లోభాత్ - పఞ్చమ్యేకవచనాన్తః, అకారాన్తః పుల్లిఙ్గః లోభశబ్దః।

ఎ) లుభ్ - భావే ఘఞ్

బి) శ్లో॥ లోభశ్చేదగుణేన కిం పిశునతా యద్యస్తి కిం పాతకైః
సత్యం చేత్తపసా చ కిం శుచి మనో యద్యస్తి తీర్థేన కిమ్।
సౌజన్యం యది కిం బలేన మహిమా యద్యస్తి కిం మణ్డనైః
సద్విద్యా యది కిం ధనైరపయశో యద్యస్తి కిం మృత్యునా॥

- భర్తృహరినీతిశతకమ్ - 44

లోభమును మించిన చెడుగుణమును, కొండెములు చెప్పుటకంటే పాపమును, సత్యవ్రతముకన్న తపస్సును.......... అపకీర్తి కంటె చావును లోకములో లేవు.

శ్లో॥ **లోభాత్** క్రోధః ప్రభవతి, **లోభాత్** కామః ప్రజాయతే।

**లోభాత్** మోహశ్చ, నాశశ్చ, లోభః పాపస్య కారణమ్॥

– హితోపదేశః 1-27

లోభమువలన కోపము, కామము, మోహముకూడ కలుగుతున్నాయి. దానివలన నాశమూ కలుగుతుంది. లోభమే అన్ని పాపాలకూ కారణముగా ఉంటూంది.

శ్లో॥ లోభేన బుద్ధిశ్చలతి, లోభో జనయతే తృషమ్।

తృషార్తో దుఃఖమాప్నోతి, పరత్రేహ చ మానవః॥

లోభమువల్ల మనస్సు చంచలమై ఉంటుంది. లోభమువల్ల ఆశలు చెలరేగును. ఆశలవల్ల ఇహపరములు రెండింటనూ మానవుడు దుఃఖమునే పొందుతున్నాడు.

బి) విను లోభము నజ్ఞానం

బును సదృశ ఫలప్రదముల; పుట్టును లోభం

బున నజ్ఞానము గావున

జననాయక! లోభముడగ సౌఖ్యములొందున్.

– తిక్కన, భారత, శాంతి. 3-402

సి) లాభాల్లోభః ప్రవర్తతే। సంపదరాగానే లోభమేర్పడుతుంది.

2. ఈ శ్లోకభావమునే 'శిశుపాలవధ' మహాకావ్యము చివర మాఘకవియును ఇట్లే చెప్పియున్నాడు.

శ్లో॥ శ్రీశబ్దరమ్యకృతసర్గసమాప్తిలక్ష్మ

లక్ష్మీపతేశ్చరితకీర్తనమాత్రచారు।

తస్యాత్మజః సుకవికీర్తిదురాశయాదః

కావ్యం వ్యధత్త శిశుపాలవధాభిధానమ్॥

**అలంకారాలు :–**అత్రోపమాలంకారః। తల్లక్షణం యథా –





'సాదృశం సుందరం వాక్యార్థోపస్కారకముపమాలంకృతిః। సౌందర్యం చ చమత్కృత్యాధాయకత్వమ్। చమత్కృతిరానన్దవిశేషః సహృదయహృదయప్రమాణకః

– రసగంగాధరే

**క్రియాదర్శము :– 1. గమిష్యామి :–** గమ్ల్ గతావిత్యస్మాద్ధాతో స్సకర్మకాత్కర్తరి భవిష్యదర్థే లృటి పరస్మైపదే ఉత్తమపురుషైకవచనాన్తః।

**గమిష్యామి** – గమిష్యావః – గమిష్యామః

**సంజీవినీ:–** మన్ద ఇతి – కిం చ మన్దో మూఢః. 'మూఢా ల్పాపటునిర్భాగ్యా మన్దాః స్యుః' ఇత్యమరః, తథాపి కవియశఃప్రార్థీ – కవీనాం యశః కావ్యనిర్మాణేన జాతం తత్ప్రార్థనాశీలోఽహం, ప్రాంశునోన్నతపురుషేణ – లభ్యే ప్రాప్యే – ఫలే ఫలవిషయే, లోభా, దుద్బాహుః ఫలగ్రహణాయోచ్ఛ్రితహస్తో, వామనః ఖర్వ – ఇవ. 'ఖర్వో హ్రస్వ శ్చ వామనః' ఇత్యమరః, అపహాస్యతా మపహాసవిషయతామ్. 'ఋహలో ర్ణ్యత్, ఇతి ణ్యత్ప్రత్యయః, గమిష్యామి ప్రాప్స్యామి.

---

**అవతారిక :–** మన్దశ్చేత్తర్హి త్యజ్యతా మయముద్యోగ ఇత్యత ఆహ –

**శ్లో॥ అథ వా కృతవాగ్ద్వారే**

**వంశేఽస్మిన్పూర్వసూరిభిః।**

**మణౌ వజ్రసముత్కీర్ణే**

**సూత్రస్యేవాస్తి మే గతిః॥** 4

**పదవిభాగము :–** అథ, వా, కృతవాగ్ద్వారే, వంశే, అస్మిన్, పూర్వసూరిభిః, మణౌ, వజ్రసముత్కీర్ణే, సూత్రస్య, ఇవ, అస్తి, మే, గతిః।

**అన్వయక్రమము :–** అథ వా పూర్వసూరిభిః కృతవాగ్ద్వారే అస్మిన్ వంశే వజ్రసముత్కీర్ణే మణౌ సూత్రస్య ఇవ మే గతిః అస్తి।

**ప్రతిపదార్థము :–** అథ వా – అట్లయినను, పూర్వసూరిభిః – పూర్వమందుండిన ప్రముఖకవులచేత, కృతవాగ్ద్వారే – చేయబడిన శబ్దరూపమగు ద్వారముగల, అస్మిన్ – ఈ, వంశే – వంశమునందు, వజ్రసముత్కీర్ణే – వజ్రముచే తొలువబడిన, మణౌ – రత్నమందు, సూత్రస్య + ఇవ – దారమునకువలె, మే – నాకు, గతిః – దారి, అస్తి – ఉన్నది.

**తాత్పర్యము :-** వజ్రముచే తొలువబడిన రత్నమునందు దారమెట్లు అనాయాసముగా ప్రవేశించుచున్నదో, అట్లే మున్ను వాల్మీకాది ప్రముఖ కవులచే చూపబడిన మార్గము నా గ్రంథరచనకు సుకరమై యున్నది.

**విభక్తులు / క్రియలు :-** 1. అథ - అవ్యయమ్। 2. వా - అవ్యయమ్। 3. కృతవాగ్ద్వారే - **కృతవాగ్ద్వారే**, కృతవాగ్ద్వారయోః, కృతవాగ్ద్వారేషు; కృతవాగ్ద్వారశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః సప్తమ్యేకవచనాన్తః। 4. వంశే - **వంశే**, వంశయోః, వంశేషు; వంశశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః సప్తమ్యేకవచనాన్తః। 5. అస్మిన్ - **అస్మిన్**, అనయోః / ఏనయోః, ఏషు; ఇదమ్ శబ్దః మకారాన్తః పుల్లిఙ్గః సప్తమ్యేకచవనాన్తః। 6. పూర్వసూరిభిః - పూర్వసూరిణా, పూర్వసూరిభ్యాం, **పూర్వసూరిభిః**; పూర్వసూరిశబ్దః ఇకారాన్తః పుల్లిఙ్గః తృతీయాబహువచనాన్తః। 7. మణౌ - **మణౌ**, మణ్యోః, మణిషు; ఇకారాన్తః పుల్లిఙ్గః సప్తమ్యేకవచనాన్తః। 8. వజ్రసముత్కీర్ణే - **వజ్రసముత్కీర్ణే**, వజ్రసముత్కీర్ణయోః, వజ్రసముత్కీర్ణేషు; వజ్రసముత్కీర్ణశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః సప్తమ్యేకవచనాన్తః। 9. సూత్రస్య - **సూత్రస్య**, సూత్రయోః, సూత్రాణామ్; సూత్రశబ్దః అకారాన్తః నపుంసకలిఙ్గః షష్ఠ్యేకవచనాన్తః। 10. ఇవ - అవ్యయమ్। 11. అస్తి - ప్రథమపురుషైకవచనాన్తః। క్రియాపదమ్ 12. మే - **మమ / మే**, ఆవయోః / నౌః , అస్మాకమ్/నః; అస్మచ్ఛబ్దః దకారాన్తః పుల్లిఙ్గః షష్ఠ్యేకవచనాన్తః। 13. గతిః - **గతిః**, గతీ, గతయః; గతిశబ్దః ఇకారాన్తః స్త్రీలిఙ్గః ప్రథమైకవచనాన్తః।

**సమాసాలు :-**

1. కృతవాగ్ద్వారే - కృత వాక్ ఏవ ద్వారం యస్య సః, కృతవాగ్ద్వారః(బహువ్రీహి), తస్మిన్।
2. పూర్వసూరిభిః - పూర్వే చ తే సూరయశ్చ - పూర్వసూరయః(వి.పూ.క.) తైః
3. వజ్రసముత్కీర్ణే - వజ్రేణ సముత్కీర్ణః - వజ్రసముత్కీర్ణః (తృ.త.) తస్మిన్।

**సంధులు :-**

1. వంశే + అస్మిన్ - వంశేఽస్మిన్ - పూర్వరూపసన్ధిః। **ఏఙఃపదాన్తాదతి** (సూ 6-1-105) పదాంతమందున్న ఏ ఓ లకు హ్రస్వ 'అ'కారము పరముగా నున్నప్పుడు పూర్వపరముల స్థానమున పూర్వరూపము ఏకాదేశమగును.
2. ఇవ + అస్తి - ఇవాస్తి - సవర్ణదీర్ఘసన్ధిః।





3. సూత్రస్య + ఇవ - సూత్రస్యేవ - గుణసన్ధిః, **ఆద్గుణః** (సూ 6-84) అవర్ణమునకు (అ,ఆ లకు) హ్రస్వదీర్ఘములైన ఇ ఉ ఋ ఌ వర్ణములు పరముగా నున్నప్పుడు పూర్వపరములస్థానములో గుణము ఏకాదేశమగును.

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు :-**

**1. సూరిః -**

ఎ) సూతే సద్వాక్యానీతి। సూ + **'సూఙః క్రిః'** ఇతి క్రిన్ పణ్డితః। (ఉణాది 4-64) సుభాషితములను సృజించువాడు.

బి)1. వి శ్లోక ఏతు పథ్యేవ సూరేః - శ్వేతా 2-5

2. తద్విష్ణోః పరమం పదం సదా పశ్యన్తి **సూరయః** - నృసింహ .ఉ.5-10

3. శ్లో॥ సప్తభేదకరకల్పితస్వరం సామ సామవిదసఙ్గముజ్జగౌ।
తత్ర సూనృతగిరశ్చ **సూరయః** పుణ్యమృగ్యజుషమధ్యగీషత॥
- శిశుపాలవధే - 14-21

**అలంకారాలు :-** అత్రోపమాలంకారః। ఇందు

పూర్వసూరికృతవాగ్ద్వారము - బింబము. వజ్రసముత్కీర్ణము - ప్రతిబింబము సూర్యవంశము - బింబము; మణి - ప్రతిబింబము. కనుక ఇట అనుగామిత్వబింబ ప్రతిబింబభావములకు మిశ్రణము గలదు. ఉపమానమగు **'సూత్ర'** శబ్దము నపుంసకలింగము. ఉపమేయమగు **'మే'** పుంలింగము అయినను 'సూ - ఇష్టం పుంనపుంసకయోః ప్రాయేణ' (కా సూ. 4-2-13) అని యాలంకారికు లంగీకరించుటచే ఈ లింగభేదము దుష్టముకాదు. అని

- శ్రీకాళిదాస కవితావైభవము

**క్రియాదర్శము :- 1. అస్తి :-** 'అస' భువి ఇత్యస్మాద్ధాతోరకర్మకాత్కర్తరి వర్తమానే లటి పరస్మైపదే ప్రథమపురుషైకవచనాన్తః।

**అస్తి** - స్తః - సన్తి

**సంజీవినీ :-** అథవేతి - అథవా పక్షాన్తరే, పూర్వైః - సూరిభిః కవిభి ర్వాల్మీక్యాదిభిః , కృతవాగ్ద్వారే కృతం రామాయణాది ప్రబన్ధరూపా యా వాక్ సైవ ద్వారం ప్రవేశో యస్య తస్మిన్, అస్మిన్ సూర్యప్రభవే, వంశే కులే - జన్మనైకలక్షణః సంతానో వంశః, వజ్రేణ మణివేధకసూచీవిశేషేణ. 'వజ్రం త్వస్త్రీ కులిశశస్త్రయోః - మణివేధే

రత్నభేదే' ఇతి కేశవః - సముత్కీర్ణే విద్ధే, మణౌ రత్నే, సూత్ర స్యేవ, మే మమ, గతిః సంచారోఽస్తి - వర్ణనీయే రఘువంశే మమ వాక్ప్రసరోఽస్తీ త్యర్థః

---

**అవతారిక :-** ఏవం రఘువంశే లబ్ధప్రవేశస్తద్వర్ణనాం ప్రతిజానానః 'సోఽహమ్' ఇత్యాదిభిః పఞ్చభిః శ్లోకైః **కులకే**నాహ -

**శ్లో|| సోఽహమాజన్మశుద్ధానా-**
**మాఫలోదయకర్మణామ్।**
**ఆసముద్రక్షితీశానా-**
**మానాకరథవర్త్మనామ్॥ 5**

**పదవిభాగము :-** సః, అహమ్, ఆజన్మశుద్ధానామ్, ఆఫలోదయకర్మణామ్, ఆసముద్రక్షితీశానామ్, ఆనాకరథవర్త్మనామ్॥

**అన్వయక్రమము :-** సోఽహమ్ ఆజన్మశుద్ధానామ్ ఆఫలోదయకర్మణామ్ ఆసముద్రక్షితీశానామ్ ఆనాకరథవర్త్మనామ్।

(ఈ శ్లోకమునుండి 'రఘూణామన్వయం వక్ష్యే' అను శ్లోకమువరకు ఒకే అన్వయము.)

**ప్రతిపదార్థము :-** సోఽహమ్ - అట్టి నేను, ఆజన్మశుద్ధానామ్ - పుట్టుక మొదలుకొని పరిశుద్ధులైనవారును, ఆఫలోదయకర్మణామ్ - ఫలము లభించువరకు పనిచేయువారును, ఆసముద్రక్షితీశానామ్ - సముద్రమువఱకునుండు భూమికి ప్రభువులైనవారును, ఆనాకరథవర్త్మనామ్ - స్వర్గమువఱకు రథమార్గము కలిగినవారును అగు (రఘూణాం - అన్వయం - వక్ష్యే।)

**తాత్పర్యము :-** అట్టి నేను, పుట్టుక మొదలుకొని పరిశుద్ధులైనవారును, ఫలము లభించువరకు శ్రమించువారును, సముద్రములను కలుపుకొని భూమండలమును పాలించువారును, స్వర్గము వఱకు రథమార్గము కలిగినవారును అగు (రఘువంశపు రాజులయొక్క వంశమును గూర్చి చెప్పబోవుచున్నాను.)

**విభక్తులు / క్రియలు :-** 1. సః - **సః**, తౌ, తే; తచ్ఛబ్దః దకారాన్తః పుల్లిఙ్గః ప్రథమైకవచనాన్తః। 2. అహమ్ - **అహమ్**, ఆవామ్, వయమ్; అస్మచ్ఛబ్దః దకారాన్తః పుల్లిఙ్గః ప్రథమైకవచనాన్తః। 3. ఆజన్మశుద్ధానామ్ - ఆజన్మశుద్ధస్య, ఆజన్మశుద్ధయోః





**ఆజన్మశుద్ధానామ్**; ఆజన్మశుద్ధశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః షష్ఠీబహువచనాన్తః। 4. ఆఫలోదయకర్మణామ్ - ఆఫలోదయకర్మణః, ఆఫలోదయకర్మణోః, **ఆఫలోదయ కర్మణామ్**; ఆఫలోదయకర్మన్‌శబ్దః నకారాన్తః పుల్లిఙ్గః షష్ఠీబహువచనాన్తః। 5. ఆసముద్రక్షితీశానామ్ - ఆసముద్రక్షితీశస్య - ఆసముద్రక్షితీశయోః, **ఆసముద్ర క్షితీశానామ్**; ఆసముద్రక్షితీశశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః షష్ఠీబహువచనాన్తః। 6. ఆనాకరథవర్త్మనామ్ - ఆనాకరథవర్త్మనః, ఆనాకరథవర్త్మనోః, **ఆనాకరథవర్త్మనామ్;** ఆనాకరథవర్త్మన్‌శబ్దః నకారాన్తః పుల్లిఙ్గః షష్ఠీబహువచనాన్తః।

**సమాసాలు :-**

1. ఆజన్మశుద్ధానామ్ - జన్మారభ్య ఆజన్మ, ఆజన్మ శుద్ధాః ఆజన్మశుద్ధాః, (తృ.త.)। తేషామ్ ఆజన్మశుద్ధానామ్।
2. ఆఫలోదయకర్మణామ్ - ఫలస్య ఉదయః ఫలోదయః ఫలోదయం అభివ్యాప్య ఆఫలోదయమ్, ఆఫలోదయం కర్మ యేషాం తే ఆఫలోదయ కర్మాణః, (బ.) తేషామ్ ఆఫలోదయకర్మణామ్।
3. ఆసముద్రక్షితీశానామ్ - సముద్రమ్ అభివ్యాప్య, ఆసముద్రమ్। క్షితేః ఈశాః క్షితీశాః (ష.త..) ఆసముద్రం క్షితీశాః ఆసముద్రక్షితీశా (సహ సుపా.) తేషామ్, ఆసముద్రక్షితీశానామ్।
4. ఆనాకరథవర్త్మనామ్ - నాకమ్ అభివ్యాప్య ఆనాకమ్ (అవ్య.) రథస్య వర్త్మ రథవర్త్మ (ష.త.); ఆనాకం రథవర్త్మ యేషాం తే ఆనాకరథవర్త్మనః (బ.) తేషామ్।

**సంధులు :-** 1. సః + అహమ్ - సోఽహమ్ - ఉత్వాదేశః

**అతోరోరప్లుతాప్లుతే** సూ (6-1-109) అప్లుతమగు హ్రస్వ అకారమునకు పరముగా నున్న రుత్వమునకు అప్లుతమైన హ్రస్వ - అకారము పరముగానున్నప్పుడు ఉకారము వచ్చును.

(రుత్వాదేశము - ఉత్వాదేశము - గుణము - పూర్వరూపము)

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు :-**

1. ఎ) 'ఆజన్మ.., ఆఫలోదయ.., ఆసముద్ర.., ఆనాక.., అను పదములలోని 'ఆ', 'ఆఙ్' అను ఉపసర్గలోనిది. దీనికి మర్యాద (హద్దు), అభివిధి (హద్దును కూడ కలుపుకొని) అనునవి అర్థములు.

బి) ఆఙ్ మర్యాదావచనే (1-4-89)

ఆఙ్ మర్యాదాయాముక్తసంజ్ఞః స్యాత్। వచనగ్రహణాదభివిధావపి।

సి)1. శ్లో॥ ఆపరితోషాద్విదుషాం న సాధు మన్యే ప్రయోగవిజ్ఞానమ్।

బలవదపి శిక్షితానామాత్మన్యప్రత్యయం చేతః। - అ.శా. 1-2

పండితులు చూచి సంతసించునంతవరకు....

2. శ్లో॥ ఆమరణాన్తాః ప్రణయాః కోపాః తత్క్షణభఙ్గురాః।

పరిత్యాగాశ్చ నిశ్శంకాః భవన్తి హి మహాత్మనామ్॥ -హితో. 1-181

'మహాత్ముల స్నేహాలు మరణపర్యంతాలు. కోపాలు క్షణభంగురాలు. దానాదికములు ప్రతిఫలాపేక్ష లేనివి అయి ఉండును.

3. శ్లో॥ ద్వాభ్యాం యుగ్మమితి ప్రోక్తం త్రిభిః శ్లోకైర్విశేషకమ్।

కలాపకం చతుర్భిః స్యాత్తదూర్ధ్వం **కులకం** స్మృతమ్॥

ఐదు లేక అంతకంటే అధికసంఖ్యాకములగు ఏకాన్వయముగల శ్లోకములు **కులక**మనబడును.

1. మాఘుని శిశుపాలవధమహాకావ్యము ప్రథమసర్గమున 4-10 వఱకుగల ఏడుశ్లోకములు **నారదునే** వర్ణించును. ఇదియు **కులకమే.**

శ్లో॥ నవానధోఽధో బృహతః పయోధరాన్...

...స్ఫుటోపమం భూతిసితేన శంభునా।.......... 1-4

శ్లో॥ రణద్భిరాఘట్టనయా నభస్వతః...

...మవేక్షమాణం మహతీం ముహుర్ముహుః॥ 1-10

2. కాళిదాసమహాకవి 'కుమారసంభవమహాకావ్యము - ప్రథమసర్గము'న 2-17 వఱకుగల శ్లోకములలో హిమాద్రిని వర్ణించినాడు. ఇదియును **కులకమే.**

**సంజీవినీ :-** సోఽహ మితి. - సోఽహమ్ - 'రఘూణా మన్వయం వక్ష్యే' ఇత్యుత్తరేణ సంబన్ధః, కిం విధానాం రఘూణా మిత్య త్రోత్తరాణి విశేషణాని యోజ్యాని; ఆ జన్మనః జన్మారభ్యే త్యర్థః 'ఆఙ్ మర్యాదాభివిధ్యోః' ఇత్యవ్యయీభావః - శుద్ధానామ్. సుప్సుపేతి సమాసః - ఏవ ముత్తర త్రాఽపి ద్రష్టవ్యమ్ - ఆజన్మశుద్ధానామ్ - నిషేకాదిసర్వసంస్కారసంపన్నానామిత్యర్థః, ఆఫలోదయమా ఫలసిద్ధేః - కర్మ యేషాం





తే తథోక్తా స్తేషామ్ - ప్రారబ్ధాన్తగామినా మిత్యర్థః ఆసముద్రం క్షితేరీశానామ్ - సార్వభౌమాణా మిత్యర్థః, ఆనాకం రథవర్త్మ యేషాం తేషామ్ - ఇన్ద్రసహచారిణా మిత్యర్థః, అత్ర సర్వత్రాఙోఽభివిధ్యర్థత్వం ద్రష్టవ్యమ్ - అన్యథా మర్యాదార్థత్వే జన్మాదిషు శుద్ధ్యభావప్రసఙ్గాత్.

---

**శ్లో॥ యథావిధిహుతాగ్నీనాం**
**యథాకామార్చితార్థినామ్।**
**యథాపరాధదణ్డానాం**
**యథాకాలప్రబోధినామ్॥ 6**

**పదవిభాగము :-** యథావిధిహుతాగ్నీనామ్, యథాకామార్చితార్థినామ్, యథాపరాధదండానామ్, యథాకాలప్రబోధినామ్।

**అన్వయక్రమము :-** యథావిధిహుతాగ్నీనాం, యథాకామార్చితార్థినాం, యథాపరాధదండానాం, యథాకాలప్రబోధినామ్।.....

**ప్రతిపదార్థము :-** యథావిధిహుతాగ్నీనామ్ - శాస్త్రము నతిక్రమింపకుండ హోమము చేయబడిన గార్హపత్యాహవనీయదక్షిణాగ్నులు కలిగినవారును, యథాకామ - అర్చిత - అర్థినామ్ - అభిలాష నతిక్రమింపకుండ పూజ చేయబడిన యాచకులు కలవారును, యథాపరాధదణ్డానామ్ - అపరాధము నతిక్రమింపకుండ దండన కలిగినవారును, యథాకాలప్రబోధినామ్ - కాలము నతిక్రమింపకుండ మేల్కొనువారును. (రఘూణాం అన్వయం వక్ష్యే)

**తాత్పర్యము :-** శాస్త్రప్రకారము హోమములు చేయువారును, యాచకుల కోరిక ననుసరించి పరిచర్య చేయువారును, దోషుల తప్పుననుసరించి తగిన శిక్ష చేయువారును, ఏ కాలములయందు ఏయే కార్యములు జేయవలయునో వాటిలో జాగరూకలై యుండువారును,...

**విభక్తులు / క్రియలు :-** 1. యథావిధిహుతాగ్నీనామ్ - యథావిధిహుతాగ్నేః, యథావిధిహుతాగ్న్యోః, **యథావిధిహుతాగ్నీనామ్**; యతావిధిహుతాగ్నిశబ్దః ఇకారాన్తః పుల్లిఙ్గః షష్ఠీబహువచనాన్తః। 2. యథాకామార్చితార్థినామ్ - యథాకామార్చితార్థినః , యథాకామార్చితార్థినోః, **యథాకామార్చితార్థినామ్**; యథాకామార్చితార్థిన్శబ్దః నకారాన్తః పుల్లిఙ్గః షష్ఠీబహువచనాన్తః। 3. యథాపరాధదణ్డానామ్ - యథాపరాధ

దణ్డస్య, యథాపరాధదణ్డయోః, **యథాపరాధదణ్డానామ్;** యథాపరాధదణ్డశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః షష్ఠీబహువచనాన్తః। 4. యథాకాల ప్రబోధినామ్ - యథాకాల ప్రబోధినః, యథాకాలప్రబోధినోః, **యథాకాలప్రబోధినామ్**; యథాకాలప్రబోధిన్‌శబ్దః నకారాన్తః పుల్లిఙ్గః షష్ఠీబహువచనాన్తః।

**సమాసాలు :-**

1. యథావిధిహుతాగ్నీనామ్ - విధిమ్ అనతిక్రమ్య - యథావిధి (అవ్య.) యథావిధి హుతాః అగ్నయః యైః తే యథావిధిహుతాగ్నయః (బ.), తేషామ్।
2. యథాకామార్చితార్థినామ్ - కామమ్ అనతిక్రమ్య - యథాకామమ్ (అవ్య.) యథాకామమ్ అర్చితాః అర్థినః యైః తే యథాకామార్చితార్థినః (బ.), తేషామ్।
3. యథాపరాధదణ్డానామ్ - అపరాధమ్ అనతిక్రమ్య, యథాపరాధమ్ (అవ్య.) యథాపరాధం దణ్డః యేషాం తే, యథాపరాధదండాః (బ.), తేషామ్।
4. యథాకాలప్రబోధినామ్ - కాలమ్ అనతిక్రమ్య, యథాకాలమ్ (అవ్య.) యథాకాలం ప్రబోధన్తే ఇతి యథాకాలప్రబోధినః (కృ.), తేషామ్।

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు :-**

**1. అగ్నిః :-** ఎ) (పుం.) అఙ్గేర్న ర్న లోపశ్చ - ఇతి నిః। ఉణాది (4.50)

బి) అగి గతౌ భ్వా. / ప. / సే. + నిః। అఙ్ గతి ఊర్ధ్వం గచ్ఛతీతి అగ్నిః। పావకః

సి) శ్లో॥ పితా వై **గార్హపత్యోఽ**గ్నిర్మాతాగ్ని**ర్దక్షిణః** స్మృతః।
గురు**రాహవనీ**యస్తు సాగ్నిత్రేతా గరీయసీ॥ - మనుస్మృతిః - 2-231

డి) అఙ్గయన్తి అగ్ర్యం జన్మ ప్రాపయన్తి ఇతి వ్యుత్పత్త్యా హవిః ప్రక్షేపాధికరణేషు గార్హపత్యాహవనీయదక్షిణాగ్నిసభ్యావసథ్యౌపాసనాఖ్యేషు షడగ్నిషు। యద్వా అఙ్గతి ఊర్ధ్వం గచ్ఛతి ఇతి। అగ్ని గతౌ, అఙ్గేర్నలోపశ్చేతి ని, నలోపశ్చ।

- హలాయుధకోశవ్యాఖ్యానము నుండి.

ఇ) **పంచ - అగ్నులు :-**

ఎ) 1. దక్షిణాగ్ని 2. గార్హపత్యాగ్ని 3. ఆహవనీయాగ్ని 4. సభ్యాగ్ని 5. ఆవసథ్యాగ్ని

బి) 1. మందాగ్ని 2. తీక్ష్ణాగ్ని 3. విషమాగ్ని 4. సమాగ్ని 5. భస్మాగ్ని;

సి) 1. బడబాగ్ని 2. జఠరాగ్ని 3. దావాగ్ని 4. గృహాగ్ని 5. వైదికాగ్ని;

డి) 1. పూర్వాగ్ని 2. దక్షిణాగ్ని 3. పశ్చిమాగ్ని 4. ఉత్తరాగ్ని 5. సూర్యాగ్ని;





... అంటూ సంకేతపదకోశము - 8 విధములుగా ఉన్నవని అగ్నిపురాణాన్ని ఉదాహరించినది.

ఎఫ్) షట్ - అగ్నులు - 1. గార్హపత్యము 2. ఆహవనీయము 3. దక్షిణము 4. సభ్యము 5. ఆవసథ్యము 6. ఔపాసనము - ఇవి కర్మకాండకు సంబంధించినవి.

**సంజీవినీ :-** యథావిధీతి - విధి మనతిక్రమ్య యథావిధి. 'యథాసాదృశ్యే ఇత్య వ్యయీభావః - తథా హుతశబ్దేన. సుప్సు పే' తి సమాసః - ఏవం 'యథాకామార్చిత - ఇత్యాదీనామపి ద్రష్టవ్యమ్ - యథావిధి హుతా అగ్నయో యైస్తేషాం, యథాకామ మభిలాషమనతిక్రమ్యార్చితార్థినామ్, యథాపరాధ మపరాధ మనతి క్రమ్య - దణ్డో యేషాం తేషామ్, యథాకాలం కాలమనతిక్రమ్య - ప్రబోధినాం ప్రబోధనశీలానామ్, చతుర్భిర్విశేషణైర్దేవతాయజ నార్థిసత్కారదణ్డధరత్వ ప్రజాపాలన సమయజాగరూక త్వాదీని వివక్షితాని.

---

**శ్లో॥ త్యాగాయ సంభృతార్థానాం**
**సత్యాయ మితభాషిణామ్।**
**యశసే విజిగీషూణాం**
**ప్రజాయై గృహమేధినామ్॥ 7**

**పదవిభాగము :-** త్యాగాయ, సంభృతార్థానామ్, సత్యాయ, మితభాషిణామ్, యశసే, విజిగీషూణామ్, ప్రజాయై, గృహమేధినామ్।

**అన్వయక్రమము :-** త్యాగాయ సంభృతార్థానాం సత్యాయ మితభాషిణాం యశసే విజిగీషూణాం ప్రజాయై గృహమేధినామ్॥...

**ప్రతిపదార్థము :-** త్యాగాయ - యోగ్యులకిచ్చుటకొరకు, సంభృతార్థానామ్ - సంపాదింపబడిన ధనము కలిగినవారును, సత్యాయ - నిజముకొఱకు, మితభాషిణామ్ - పరిమితముగ మాట్లాడువారును, యశసే - కీర్తికొఱకు, విజిగీషూణామ్ - జయింపగోరువారును, ప్రజాయై - సంతానము కొఱకు, గృహమేధినామ్ - గృహస్థులైనవారును; (రఘూణాం అన్వయం వక్ష్యే)

**తాత్పర్యము :-** యోగ్యులకిచ్చుటకొఱకు సంపాదింపబడిన ధనము కలిగిన వారును, నిజముకొఱకు పరిమితముగ మాట్లాడువారును, కీర్తికొఱకు జయింపగోరువారును, సంతానము కొఱకు గృహస్థులైనవారును;....

**విభక్తులు / క్రియలు :-** 1. త్యాగాయ - **త్యాగాయ**, త్యాగాభ్యాం, త్యాగేభ్యః; త్యాగశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః చతుర్థ్యేకవచనాన్తః। 2. సత్యాయ - **సత్యాయ**, సత్యాభ్యాం, సత్యేభ్యః; సత్యశబ్దః అకారాన్తః నపుంసకలిఙ్గః చతుర్థ్యేకవచనాన్తః। 3. యశసే - **యశసే**, యశోభ్యాం, యశోభ్యః; యశశ్శబ్దః సకారాన్తః నపుంసకలిఙ్గః చతుర్థ్యేకవచనాన్తః। 4. ప్రజాయై - **ప్రజాయై**, ప్రజాభ్యాం, ప్రజాభ్యః; ప్రజాశబ్దః ఆకారాన్తః స్త్రీలిఙ్గః చతుర్థ్యేకవచనాన్తః। 5. సంభృతార్థానామ్ - సంభృతార్థస్య, సంభృతార్థయోః, **సంభృతార్థానామ్**; సంభృతార్థశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః షష్ఠీబహువచనాన్తః। 6. మితభాషిణామ్ - మితభాషిణః, మితభాషిణోః, **మితభాషిణామ్**; మితభాషిన్‌శబ్దః నకారాన్తః పుల్లిఙ్గః షష్ఠీబహువచనాన్తః। 7. విజిగీషూణామ్ - విజిగీషోః, విజిగీష్వోః, **విజిగీషూణామ్**; విజిగీషుశబ్దః ఉకారాన్తః పుల్లిఙ్గః షష్ఠీబహువచనాన్తః। 8. గృహమేధినామ్ - గృహమేధినః, గృహమేధినోః, **గృహమేధినామ్**; గృహమేధిన్‌శబ్దః నకారాన్తః పుల్లిఙ్గః షష్ఠీబహువచనాన్తః।

**సమాసాలు :-**

1. సంభృతార్థానామ్ - సంభృతాః అర్థాః యైః తే, సంభృతార్థాః (బ.), తేషామ్।
2. మితభాషిణామ్ - మితం భాషన్త ఇతి మితభాషిణః(కృ.), తేషామ్।
3. విజిగీషూణామ్ - విజేతుమ్ ఇచ్ఛుః విజిగీషుః (సన్.), తేషామ్।
4. గృహమేధినామ్ - గృహైః మేధన్త ఇతి గృహమేధినః (కృ.), తేషామ్।

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు :-**

1. **త్యాగః** - ఎ) త్యజ్ - భావే ఘఞ్

బి) శ్లో॥ కరే శ్లాఘ్యస్త్యాగః, శిరసి గురుపాదప్రణయితా,
ముఖే సత్యా వాణీ విజయి, భుజయోర్వీర్యమతులమ్।
హృది స్వచ్ఛావృత్తిః శ్రుతమధిగతం చ శ్రవణయో
ర్వినాప్యైశ్వర్యేణ ప్రకృతిమహతాం మణ్డనమిదమ్॥

- భర్తృహరి, నీతి, 53

హస్తంబులకు సత్పాత్రదానము, శిరంబునకు గురుపాదనమస్కృతియు, ముఖంబునకు సత్యవచనమును, భుజంబులకు జయస్వభావమగు పరాక్రమమును, హృదయంబునకు అకలంకమయిన ప్రవర్తనయు, చెవులకు శాస్త్రశ్రవణమున్ను అలంకారములు.

19



సి) శ్లో॥ ఉపార్జితానాం విత్తానాం **త్యాగ** ఏవ హి రక్షణమ్।
తటాకోదరసంస్థానాం పరీవాహ ఇవామ్భసామ్॥

- హితోపదేశః, మిత్రలాభః -149

"చెఱువులో పొంగిపొరలే నీటికి అలుగువలె, సంపాదించిన సంపదలకు **దానమే** రక్షణ ఇస్తుంది."

డి) శ్లో॥ **త్యాగ** ఏకో గుణః శ్లాఘ్యః కిమన్యైః గుణరాశిభిః।
**త్యాగాజ్జ**గతి పూజ్యన్తే పశుపాషాణపాదపాః॥

- విక్రమార్కచరితమ్

త్యాగ గుణము ఒకటి సర్వత్ర పూజింపబడుచున్నది. మిగిలిన గుణము లన్నింటికంటే త్యాగము గొప్పది. త్యాగము వల్లనే జగత్తున పాషాణాదులు, వృక్షములు, జంతువులున్నూ పూజనీయములు అగుచున్నవి.

**సంజీవినీ :-**త్యాగాయేతి - త్యాగాయ - సత్పాత్రే వినియోగ స్త్యాగ స్తస్మై. 'త్యాగో విహాపనం దానమ్' ఇత్యమరః, సంభృతార్థానాం సంచితధనానామ్ - న తు దుర్వ్యాపారాయ' సత్యాయ, మితభాషిణాం మితభాషణశీలానామ్ - న తు పరా భవాయ, యశసే కీర్తయే. 'యశః కీర్తిః సమజ్ఞా చ' ఇ త్యమరః, విజిగీషూణాం విజేతు మిచ్ఛూనామ్ - న త్వర్థ సంగ్రహాయ, ప్రజాయై సంతానాయ, గృహమేధినాం దారపరిగ్రహాణామ్ - న తు కామోపభోగాయ, అత్ర 'త్యాగాయ' ఇత్యాదిషు. చతుర్థీ తదర్థ -' ఇత్యాదినా తాదర్థ్యే చతుర్థీసమాసవిధానజ్ఞాపకాచ్చతుర్థీ, గృహైర్దారైర్మేధన్తే సంగచ్ఛన్త ఇతి గృహమేధినః, 'దారేష్వపి గృహాః' ఇత్యమరః 'జాయా చ గృహిణీ గృహమ్' ఇతి హలాయుధః. 'మేధృ సంగమే' ఇతి ధాతోర్ణినిః; ఏభిర్విశేషణైః పరోపకారిత్వం సత్యవచనత్వం యశఃపరత్వం పితౄణాం శుద్ధత్వం చ వివక్షితాని.

---

**శ్లో॥ శైశవేఽభ్యస్తవిద్యానాం**
**యౌవనే విషయైషిణామ్।**
**వార్ధకే మునివృత్తీనాం**
**యోగేనాన్తే తనుత్యజామ్॥** **8**

**తాత్పర్యము :-** మనోరథసాఫల్యమును సూచించెడి వాయువుయొక్క అనుకూల్యము వలన అశ్వములచేత ఎగరకొట్టబడినదగు పరాగముచేత తాకబడని ముంగురులను, తలపాకయును కలవారగుచు ... (ఆ సుదక్షిణాదిలీపులు గురువగు వసిష్ఠులవారి ఆశ్రమమున కేగిరి.)

**విభక్తులు / క్రియలు :-** 1. పవనస్య - **పవనస్య**, పవనయోః, పవనానామ్; పవనశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః షష్ఠ్యేకవచనాన్తః। 2. అనుకూలత్వాత్ - **అనుకూలత్వాత్**, అనుకూలత్వాభ్యాం, అనుకూలత్వేభ్యః; అనుకూలత్వశబ్దః అకారాన్తః నపుంసకలిఙ్గః పఞ్చమ్యేకవచనాన్తః। 3. ప్రార్థనాసిద్ధిశంసినః - **...శంసినః,** ...శంసినోః, ...శంసిన్‌శబ్దః నకారాన్తః పుల్లిఙ్గః షష్ఠ్యేకవచనాన్తః। 4. రజోభిః - రజసా, రజోభ్యాం, **రజోభిః**; రజశ్శబ్దః సకారాన్తః నపుంసకలిఙ్గః తృతీయా బహువచనాన్తః। 5. తురగోత్కీర్ణైః - తురగోత్కీర్ణేన, తురగోత్కీర్ణాభ్యాం, **తురగోత్కీర్ణైః** ; తురగోత్కీర్ణశబ్దః అకారాన్తః నపుంసకలిఙ్గః తృతీయాబహువచనాన్తః। 6. అస్పృష్టాలకవేష్టనౌ - ...వేష్టనః, **...వేష్టనౌ**, ...వేష్టనాః; అస్పృష్టాలకవేష్టనశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః ప్రథమాద్వివచనాన్తః।

**సమాసాలు :-**

1. ప్రార్థనాసిద్ధిశంసినః - ప్రార్థనాయాః సిద్ధిః ప్రార్థనాసిద్ధిః (ష.త.), ప్రార్థనాసిద్ధిం శంసతి ఇతి, ప్రార్థనాసిద్ధిశంసీ (కృ.) తస్య।
2. తురగోత్కీర్ణైః - తురగైః ఉత్కీర్ణాని, తురగోత్కీర్ణాని (తృ.త.), తైః।
3. అస్పృష్టాలకవేష్టనౌ - న స్పృష్టాని, అస్పృష్టాని, (నఞ్ త.) అలకాశ్చ వేష్టనం చ అలకవేష్టనాని (ద్వం.), అస్పృష్టాని అలకవేష్టనాని యయోః తౌ (బ.)।

**సంధులు :-**

1. పవనస్య + అనుకూలత్వాత్ - పవనస్యానుకూలత్వాత్ - సవర్ణదీర్ఘసన్ధిః।
2. రజోభిః + తురగోత్కీర్ణైః - రజోభిస్తురగోత్కీర్ణైః - విసర్గసన్ధిః(సకారాదేశః)।
3. ఉత్కీర్ణైః + అస్పృష్ట ... - ఉత్కీర్ణైరస్పృష్ట ... - విసర్గసన్ధిః (రేఫాదేశః)।

**పదవ్యుత్పత్తి -నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు :-**

**1. పవనః (పుం.) -**

ఎ) పునాతీతి, పూ + 'బహులమన్యత్రాపీతి' యుచ్. వాయుః। పూ + ల్యుట్.





బి)"**భూవాయురావహ ఇహ ప్రవహస్తు దూర్ధ్వః స్యాత్ ఉద్వహస్తదను సంవహసంజ్ఞకశ్చ।**
**అన్యః పరోఽపి, సువహః పరిపూర్వకోఽస్మాద్ బాహ్యః పరావహ ఇమే పవనాః ప్రసిద్ధాః।"**
- ఇతి సిద్ధాన్తశిరోమణౌ

సి) శ్లో।। **పవనః** శ్వసనో వాయుర్మరుదనిలో మారుతో జగత్ప్రాణః।
పృషదశ్వః పవమానః ప్రభఞ్జనః స్పర్శనో వాతః।।85
శ్లో।। నభస్వాన్మాతరిశ్వా చ సమీరశ్చ సమీరణః।
సదాగతిర్గన్ధవహో హరిః ప్రోక్తో మహాబలః।। 86
- అని హలాయుధకోశము '20' నామములను పేర్కొన్నది.

డి) పవనస్య అనుకూలత్వాత్ - గాలి అనుకూలముగా నుండుటవలన అని చెప్పుట ఆచారమందున్నది. ఇట్టిచోట్ల 'షష్ఠి'కి ప్రథమార్థముచెప్పుటవలన, భావము బాగుగా బోధపడును.

ఇ) **'అనుకూలవాతచాతకరుతజలాకాదర్శనం శుభసూచకమ్'** అని శకునశాస్త్రము

**సంజీవినీ :-** పవన స్యేతి. - ప్రార్థనాసిద్ధిసూచకస్య పవనస్య, అనుకూలత్వా ద్గన్తవ్యదిగభిముఖత్వాత్, తురగోత్కీర్ణైః, రజోభిః, అస్పృష్టాని - అలకాదేవ్యాః- వేష్టనం ఉష్ణీషో రాజ్ఞ - శ్చైతాని యయో స్తౌ - 'శిరసా వేష్టనశోభినా నృప' ఇతి వక్ష్యతి చ.

---

**అవతారిక :-** అరవిన్దానామామోదేన ఘ్రాణేన్ద్రియతర్పణమభూత్।

**శ్లో।। సరసీష్వరవిన్దానాం**
**వీచివిక్షోభశీతలమ్।**
**ఆమోదముపజిఘ్రన్తౌ**
**స్వనిఃశ్వాసానుకారిణమ్।।** **43**

**పదవిభాగము :-** సరసీషు, అరవిన్దానామ్, వీచివిక్షోభశీతలమ్, ఆమోదమ్, ఉపజిఘ్రన్తౌ, స్వనిఃశ్వాసానుకారిణమ్।

**అన్వయక్రమము :-** సరసీషు వీచివిక్షోభశీతలం స్వనిఃశ్వాసానుకారిణమ్ అరవిన్దానామ్ ఆమోదమ్ ఉపజిఘ్రన్తౌ...।

**ప్రతిపదార్థము :-** సరసీషు - సరస్సులయందు, వీచివిక్షోభశీతలమ్ - అలల తాకిడిచే చల్లనైనదియును, స్వనిశ్శ్వాసానుకారిణమ్ - తమ నిట్టూర్పును అనుకరించునదియును అగు, అరవిన్దానామ్ - పద్మములయొక్క, ఆమోదమ్ - సుగంధమును, ఉపజిఘ్రన్తౌ - వాసన చూచుచున్నవా (రగుచు...) (తౌ దమ్పతీ వసిష్ఠస్య గురోర్జగ్మతురాశ్రమమ్।)

**తాత్పర్యము :-** సరస్సులయందు అలల తాకిడిచే చల్లనైనదియును, తమ నిట్టూర్పును అనుకరించునదియును అగు పద్మసుగంధమును వాసన చూచుచున్న వా(రగుచు...) (ఆ సుదక్షిణాదిలీపులు గురువగు వసిష్ఠుల వారి ఆశ్రమమునకేగిరి.)

**విభక్తులు / క్రియలు :-** 1. సరసీషు - సరస్యాం, సరస్యోః, **సరసీషు**; సరసీశబ్దః ఈకారాన్తః స్త్రీలిఙ్గః సప్తమీబహువచనాన్తః। 2. అరవిన్దానామ్ - అరవిన్దస్య, అరవిన్దయోః, **అరవిన్దానామ్**; అరవిన్దశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః ద్వితీయైకవచనాన్తః । 3. వీచివిక్షోభశీతలమ్ - **...శీతలమ్**, ...శీతలౌ, ...శీతలాన్; ...శీతలశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః ద్వితీయైకవచనాన్తః। 4. ఆమోదమ్ - **ఆమోదమ్**, ఆమోదౌ, ఆమోదాన్; ఆమోదశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః ద్వితీయైకవచనాన్తః। 5. ఉపజిఘ్రన్తౌ - ఉపజిఘ్రన్, **ఉపజిఘ్రన్తౌ**, ఉపజిఘ్రన్తః; ఉపజిఘ్రత్ శబ్దః తకారాన్తః పుల్లిఙ్గః ప్రథమాద్వివచనాన్తః। 6. స్వనిఃశాసానుకారిణమ్ - **...అనుకారిణం,** ...అనుకారిణౌ, ...అనుకారిణః; స్వనిఃశానుకారిణ్‌శబ్దః నకారాన్తః పుల్లిఙ్గః ద్వితీయైకవచనాన్తః।

**సమాసాలు :-**

1. వీచివిక్షోభశీతలమ్ - వీచిభిః విక్షోభః, వీచివిక్షోభః (తృ.త), వీచివిక్షోభేన శీతలమ్, వీచివిక్షోభశీతలః (తృ.త.), తమ్।
2. స్వనిఃశ్వాసానుకారిణమ్ - స్వయోః నిఃశ్వాసాః స్వనిఃశ్వాసాః, స్వనిఃశ్వాసాన్ అనుకరోతీతి స్వనిఃశ్వాసానుకారీ (కృ.), తమ్।

**పాఠాన్తరాలు :-** 1. విక్షోభ - విక్షేప। 2. కారిణమ్ - వాదినమ్।

**సంధులు :-**

1. సరసీషు + అరవిన్దానామ్ - సరసీష్వరవిన్దానామ్ - యణాదేశసన్ధిః।

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు :-**

**1. ఆమోదః** - ఎ) ఆఙ్ + ముద్ + ఘఞ్। **అతిదూరగామిగన్ధః।**

69



బి) శ్లో॥ ఆమోదః స్యాత్పరిమలః సౌరభ్యం చ సుగన్ధితా॥' 77

- అని హలాయుధకోశము '4' నామములను పేర్కొన్నది.

సి)1. శ్లో॥ కకుద్మికన్యావక్త్రాన్తర్వాసలబ్ధాధివాసయా।
ముఖామోదం మదిరయా కృతానువ్యాధముద్వమన్॥ -మాఘే 2-20

2. శ్లో॥ **ఆమోదం** కుసుమభవం మృదేవ ధత్తే మృద్గన్ధం
నహి కుసుమాని ధారయన్తి...;

డి) ఆమోదషట్పదన్యాయమ్ - ఆమోదమ్ - సువాసన, షట్పదమ్ - తుమ్మెద. పరిమళాన్ని బట్టి తుమ్మెద పువ్వు ఉన్నచోటు గ్రహించి చేరుకుంటుంది.

నేర్పు, ఆసక్తి ఉన్నవాడు జాడ తెలిసి తనపని తాను సాధించుకుంటాడు.

**అలంకారాలు :-** ఇందు ప్రతీపాలంకారమున్నదని చెప్పదగును. తల్లక్షణం యథా 'సూ - ఉపమానస్య ఆక్షేపః ఉపమేయతాకల్పనం వా ప్రతీపమ్।'

- అలంకారసర్వస్వమ్ - 71

ఉపమానముయొక్క ఆక్షేపము లేదా దానికి ఉపమేయత్వం కల్పించబడడం గాని ప్రతీపాలంకారమగును.

ఇట ఉపమానమగు కమలగంధమునకు ఉపమేయత్వము కల్పింపబడుటచే నిది ప్రతీపాలంకారమని చెప్పదగును.

**సంజీవినీ:-** సరసీష్వితి. - సరసీషు, వీచి విక్షోభశీతలం ఊర్మి సంఘట్టనేన శీతలం, స్వనిఃశ్వాసమనుకర్తుం శీలమస్యేతి స్వనిఃశ్వాసానుకారిణమ్ - ఏతేన తయోరుత్కృష్టస్త్రీపుంజాతిత్వముక్తమ్, అరవిన్దానామ్, ఆమోదం పరిమళమ్, ఉపజిఘ్రన్తౌ ఘ్రాణేన గృహ్ణన్తౌ.

---

**అవతారిక :-** యజ్వభిర్గ్రామేషు కృతోపచారౌ జగ్మతుః -

**శ్లో॥ గ్రామేష్వాత్మవిసృష్టేషు**
**యూపచిహ్నేషు యజ్వనామ్।**
**అమోఘాః ప్రతిగృహ్ణన్తా -**
**వర్ఘ్యానుపదమాశిషః॥** **44**

**పదవిభాగము :-** గ్రామేషు, ఆత్మవిసృష్టేషు, యూపచిహ్నేషు, యజ్వనామ్, అమోఘాః, ప్రతిగృహ్ణన్తౌ, అర్ఘ్యానుపదమ్, ఆశిషః।

**అన్వయక్రమము :-** ఆత్మవిసృష్టేషు యూపచిహ్నేషు గ్రామేషు అమోఘాః యజ్వనామ్ ఆశిషః అర్ఘ్యానుపద ప్రతిగృహ్ణన్తౌ...

**ప్రతిపదార్థము :-** ఆత్మవిసృష్టేషు - తమచేత విడువబడినవియు, యూపచిహ్నేషు - యూపస్తంభములే చిహ్నములుగా కలవియు అగు, గ్రామేషు - గ్రామములందు, అమోఘాః - తిరుగులేనివి అగు యజ్వనామ్ ఆశిషః - ఋత్విక్కుల ఆశీస్సులను, అర్ఘ్యానుపదమ్ - అర్ఘ్యము స్వీకరించిన వెంటనే, ప్రతిగృహ్ణన్తౌ - స్వీకరించుచున్నవా (రగుచు...) (తౌ దమ్పతీ వసిష్ఠస్య గురోర్జగ్మతురాశ్రమమ్।)

**తాత్పర్యము :-** తమచేత విడువబడినవియు, యూపస్తంభములే చిహ్నములుగా కలవియు అగు గ్రామములందు తిరుగులేనివి అగు ఋత్విక్కుల ఆశీస్సులను, అర్ఘ్యము స్వీకరించిన వెంటనే స్వీకరించుచున్న వా(రగుచు) (ఆ సుదక్షిణాదిలీపులు గురువగు వసిష్ఠులవారి ఆశ్రమమున కేగిరి.)

**విభక్తులు / క్రియలు :-** 1. గ్రామేషు - గ్రామే, గ్రామయోః, **గ్రామేషు**; గ్రామశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః సప్తమీబహువచనాన్తః। 2. ఆత్మవిసృష్టేషు - ఆత్మవిసృష్టే, ఆత్మవిసృష్టయోః, **ఆత్మవిసృష్టేషు**; ఆత్మవిసృష్టశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః సప్తమీ బహువచనాన్తః। 3. యూపచిహ్నేషు - యూపచిహ్నే, యూపచిహ్నయోః, **యూపచిహ్నేషు**; యూపచిహ్నశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః సప్తమీబహువచనాన్తః। 4. యజ్వనామ్ - యజ్వనః, యజ్వనోః, **యజ్వనామ్**; యజ్వన్ శబ్దః నకారాన్తః పుల్లిఙ్గః సప్తమీబహువచనాన్తః। 5. అమోఘాః - అమోఘాం, అమోఘే, **అమోఘాః;** అమోఘాశబ్దః ఆకారాన్తః స్త్రీలిఙ్గః ద్వితీయాబహువచనాన్తః। 6. ఆశిషః - ఆశిషం, ఆశిషౌ, **ఆశిషః**; ఆశీశ్శబ్దః షకారాన్తః స్త్రీలిఙ్గః ద్వితీయాబహువచనాన్తః। 7. ప్రతిగృహ్ణన్తౌ - ప్రతిగృహ్ణన్, **ప్రతిగృహ్ణన్తౌ**, ప్రతిగృహ్ణన్తః; ప్రతిగృహ్ణచ్ఛబ్దః తకారాన్తః పుల్లిఙ్గః ప్రథమాద్వివచనాన్తః। 8. అర్ఘ్యానుపదమ్ - అవ్యయమ్।

**సమాసాలు :-**

1. ఆత్మవిసృష్టేషు - ఆత్మనా విసృష్టాః ఆత్మవిసృష్టాః (తృ.త.), తేషు।
2. యూపచిహ్నేషు- యూపా ఏవ చిహ్నాని యేషాం తే, యూపచిహ్నాః (బ.) తేషు।
3. అమోఘాః - మోఘాః న భవన్తీతి అమోఘాః (నఞ్ త.)।





4. అర్ఘ్యానుపదమ్ - అర్ఘాయ ఇదం అర్ఘ్యం, అర్ఘ్యస్య అనుపదమ్ (ష.త.)।

**పాఠాన్తరాలు :-** 1. విసృష్టేషు.... నిసృష్టేషు।

**సంధులు :-**

1. గ్రామేషు + ఆత్మవిసృష్టేషు - గ్రామేష్వాత్మవిసృష్టేషు - యణాదేశసన్ధిః।
2. ప్రతిగృహ్ణన్తౌ + అర్ఘ్యానుపదమ్ - ప్రతిగృహ్ణన్తావర్ఘ్యానుపదమ్ - ఏచోఽ యవాయావః।

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు :-**

**1. అమోఘాః** - ఎ) న మోఘాః భవన్తీతి అమోఘాః।

బి) శ్లో॥ సుకుమారమేకమణు మర్మభిదా-
మతిదూరగం యుతమమోఘతయా।
అవిపక్షమస్త్రమపరం కతమ
ద్విజయాయ యూయమివ చిత్తభువః। - కిరాతే 6-40

2. '**అమోఘా** హాస్యాశిషో భవన్తి' - ఛాన్దో 7-14-20

3. శ్లో॥ **అమోఘం** సన్దధే చాస్మై ధనుష్యేకధనుర్ధరః।
బ్రాహ్మమస్త్రం ప్రియాశోకశల్యనిష్కర్షణౌషధమ్॥ - ర.వం. 12-97

"అమోఘమైనదగు బ్రహ్మాస్త్రమును రావణునిపై ప్రయోగించుటకై సంధించెను.' ఇట (పుం.) ద్వితీయైకవచనాన్తః।

**సంజీవినీ :-** గ్రామేష్వితి. - ఆత్మ విసృష్టేషు స్వ దత్తేషు, యూపో నామ యజ్ఞీయ పశుబన్ధనదారువిశేషః - యూపా ఏవ చిహ్నాని యేషాం తేషు గ్రామేషు, అమోఘాః సఫలాః, యజ్వనాం విధి నేష్టవతాం. 'యజ్వా తు విధి నేష్టవా ని' త్యమరః. 'సుయజో ర్జ్వ ని బి' తి జ్వనిప్ ప్రత్యయః, ఆశిషః ఆశీర్వాదాన్ అర్ఘః పూజావిధిః - తదర్థం ద్రవ్యమర్ఘ్యం. 'పాదార్ఘాభ్యాం చే'తి యత్ ప్రత్యయః. 'షట్తు త్రిష్వర్ఘ్యమర్ఘార్థే పాద్యం పాదాయ వారి ణీ' త్యమరః అర్ఘస్య - అనుపదమన్వక్ - అర్ఘ్యస్వీకారానన్తర మి త్యర్థః, ప్రతిగృహ్ణన్తౌ - స్వీకుర్వన్తౌ - పదస్య పశ్చా దనుపదం. పశ్చాదర్థేఽ వ్యయీభావః 'అన్వ గన్వక్షమనుగేఽ నుపదం క్లీబ మవ్యయ మి' త్యమరః.

---

**అవతారిక :–** ఘోషవృద్ధైరప్యాదరాత్సత్కృతౌ–

**శ్లో॥ హైయఙ్గవీనమాదాయ**
**ఘోషవృద్ధానుపస్థితాన్।**
**నామధేయాని పృచ్ఛన్తౌ**
**వన్యానాం మార్గశాఖినామ్॥ 45**

**పదవిభాగము :–** హైయఙ్గవీనమ్, ఆదాయ, ఘోషవృద్ధాన్, ఉపస్థితాన్, నామధేయాని, పృచ్ఛన్తౌ, వన్యానామ్, మార్గశిఖానామ్।

**అన్వయక్రమము :–** హయ్యంగవీనమ్ ఆదాయ ఉపస్థితాన్ ఘోషవృద్ధాన్ వన్యానాం మార్గశాఖినాం నామధేయాని పృచ్ఛన్తౌ...

**ప్రతిపదార్థము :–** హైయంగవీనమ్ – సద్యోఘృతమును, ఆదాయ – తీసుకొని, ఉపస్థితాన్ – వచ్చిన, ఘోషవృద్ధాన్ – గొల్లపల్లెలలోని వృద్ధులను, వన్యానామ్ – అడవియందు పుట్టినవగు, మార్గశాఖినామ్ – మార్గమందలి చెట్లయొక్క, నామధేయాని – పేళ్లను, పృచ్ఛన్తౌ – అడుగుచున్న వా(రగుచు...)

(తౌ దమ్పతీ వసిష్ఠస్య గురోర్జగ్మతురాశ్రమమ్।)

**తాత్పర్యము :–** సద్యోఘృతమును తీసుకొని వచ్చిన గొల్లపల్లెలలోని వృద్ధులను, అడవియందు పుట్టినవగు మార్గమందలి చెట్లయొక్క పేళ్లను అడుగుచున్నవా(రగుచు...) (ఆ సుదక్షిణాదిలీపులు గురువగు వసిష్ఠుల వారి ఆశ్రమమున కేగిరి.)

**విభక్తులు / క్రియలు :–** 1. హయ్యంగవీనమ్ – **...వీనమ్**, ...వీనే, ...వీనాని, హయ్యంగవీనశబ్దః; అకారాన్తః నపుంసకలిఙ్గః ద్వితీయైకవచనాన్తః। 2. ఆదాయ – ల్యప్ ప్రత్యయాన్తమవ్యయమ్। 3. ఘోషవృద్ధాన్ – ఘోషవృద్ధమ్, ఘోషవృద్ధౌ, **ఘోషవృద్ధాన్**; ఘోషవృద్ధశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః ద్వితీయాబహువచనాన్తః। 4. ఉపస్థితాన్ – ఉపస్థితం, ఉపస్థితౌ, **ఉపస్థితాన్**; ఉపస్థితశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః ద్వితీయాబహువచనాన్తః। 5. నామధేయాని – నామధేయం, నామధేయే, **నామధేయాని**; నామధేయశబ్దః అకారాన్తః నపుంసకలిఙ్గః ద్వితీయాబహువచనాన్తః। 6. పృచ్ఛన్తౌ – పృచ్ఛన్, **పృచ్ఛన్తౌ**, పృచ్ఛన్తః; తకారాన్తః పుల్లిఙ్గః ప్రథమాద్వివచనాన్తః। 7. వన్యానామ్ – వన్యస్య, వన్యయోః, **వన్యానామ్**; వన్యశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః షష్ఠీబహువచనాన్తః। 8. మార్గశాఖినామ్ – మార్గశాఖినః, మార్గశాఖినోః,





**మార్గశాఖినామ్**; మార్గశాఖిన్‌శబ్దః నకారాన్తః పుల్లిఙ్గః షష్ఠీబహువచనాన్తః।

**సమాసాలు :–**

1. హయ్యంగవీనమ్ – హ్యః గోదోహోద్భవమ్ (తద్ధి.), తత్।
2. ఘోషవృద్ధాన్ – ఘోషే వృద్ధాః (స.త.), తాన్।
3. వన్యానామ్ – వనే భవాః, వన్యాః (తద్ధి.), తేషామ్।
4. మార్గశాఖినామ్ – శాఖాః ఏషాం సన్తీతి శాఖినః (తద్ధి.), మార్గే శాఖినః, మార్గశాఖినః (స.త.), తేషామ్।

**పాఠాన్తరాలు :–** వృద్ధానుపస్థితాన్ –... వృద్ధానుపగతాన్।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. హైయంగవీనమ్** – ఎ) హ్యో గోదోహస్య వికారః ఇతి, 'హైయఙ్గవీనం సంజ్ఞాయామ్' ఇతి ఖఞ్ హియఙ్గ్వాదేశశ్చ। సద్యో గోదోహోద్భవం ఘృతమ్; నవనీతం; దధిసారం;...

బి) **శ్లో॥ హైయంగవీనం క్షీరాణి దధి వా కిమజీజనన్।**
**గోధనం సర్వమేవేదం నీరోగం ప్రతిపద్యతే॥ – ఇతి హరివంశే**

సి) దధిసారం నవనీతం బ్రువతే **హైయంగవీనమ్** చ॥ 274
– అని హలాయుధకోశము '3' నామములను పేర్కొన్నది.

డి) హైయంగవమ్ = హైయంగవీనమ్

శ్లో॥ సంజాతకోపఃస్ఫురితారుణాధరం సందశ్య దద్భిర్దధిమంథభాజనమ్।
భిత్త్వా మృషాశ్రుర్దృషదశ్మనారహో జఘాస హైయంగవమన్తరం గతః॥ – శ్రీమద్భాగవతమహాపురాణే – 10–9–6

"...వెన్నను దొంగిలించుకొని ఇంటి లోగిలిం జేరి యేకాంతమున దానిని భక్షించెను."

2. అత్ర కులకే స్వభావోక్తిభావికయోర్యథాయోగం సమావేశః...

'ప్రత్యక్షా ఇవ యద్భావాః క్రియన్తే భూతభావినః। తద్భావికమ్...

తత్ర 'సేవ్యమానౌ ఇత్యాదిషు స్వభావోక్తిః', 'స్నిగ్ధగమ్భీర' ఇత్యాదిషు భావికమ్, తస్య చ భూయః ప్రబన్ధవ్యాపిత్వం ద్రష్టవ్యమ్। అత్ర చ నియమార్థం గచ్ఛతే రపి

తయోః రాజోపచారాణాం నిష్పత్తిర్దర్శితా। తత్ర స్నిగ్ధేత్యాదౌ మాభూదిత్యాదౌ చ ఉద్యానగమనాదిసమయసముచితస్య వ్యవహారస్య సేవ్యమానావిత్యాదౌ వ్యజనస్య, మనోభిరామా ఇత్యాదౌ గీతస్య, పవనస్యేతి ఛత్రకార్యస్య... శ్రేణీబన్ధాదితి తోరణస్రజః , గ్రామేష్వితి త్రైవిద్యోపస్థానస్య, సరసీష్వితి శిశిరోపచారస్య హైయంగవీనమితి జానపదోపస్థానస్య... యత్ర చైవం కులకాదిని బన్ధః తత్ర విప్రకీర్ణానాం వాక్యార్థానాం పిణ్డీకరణం ప్రయోజనమ్। తత్ర క్వచిద్వాచ్యౌచిత్యేన క్వచిత్ రసౌచిత్యేన। తత్ర వాచ్యౌచిత్యేన యథా - అనంతరోక్తకలాపకే। రసౌచిత్యేన తు నిరూప్యతే, ఇహ ఖలు విభావాదివర్గాన్తఃపాతిత్వేన రసానుపయోగినామనుపాదానమేవ। తదన్తః పాతిత్యాదుపయోగినాం తు ద్వయీ గతి... పరంపరయా, సాక్షాత్ చ। తత్ర సాక్షాదుపయోగినాం విధేయతయా వర్ణనమన్యేషాం త్వనువాద్యత్వేన। అనువాదే చ తేషాం పిణ్డీకరణమ్। యది హి తేఽపి విధేయతయా వర్ణ్యేరన్, తదా వాక్యార్థీభూతేషు తేషు విశ్రామ్యన్త్యాః ప్రతీతేః దురాసదో రసః స్యాత్।... అత ఏవ చాత్ర రసావిహితేన కవినా అర్చనాదిరనూద్యమానత్వేనోపనిబద్ధః గమనాదిః తు నాయకవ్యాపారో విధేయత్వేన। స చానుభావరూపో రసస్య సాక్షాదఙ్గమ్; అన్యస్తు న తథా"।

- అరుణగిరినాథః।

**సంజీవినీ :-** హైయఙ్గవీనమితి. - హ్యస్తన గోదోహోద్భవం ఘృతం హైయఙ్గవీనం - హ్యః పూర్వేద్యుః. 'తత్తు హైయఙ్గవీనం యద్ధ్యోగోదోహోద్భవం ఘృత మి' త్యమరః . 'హైయఙ్గవీనం సంజ్ఞాయా మి' తి నిపాతనాత్ సాధుః - తత్ సద్యోఘృత, మాదాయ, ఉపస్థితాన్ ప్రాప్తాన్ ఘోషేషు వృద్ధాన్ ఘోష ఆభీరపల్లీ స్యాది' త్యమరః , వన్యానాం వనోద్భవానాం, మార్గశాఖినాం నామధేయాని, పృచ్ఛన్తౌ. 'దుహ్యాజి' త్యాదినా పృచ్ఛతేః ద్వికర్మకత్వమ్.

---

**అవతారిక :-** శుద్ధవిషయోస్తయోరాసీదవర్ణనీయా శోభా-

**శ్లో।। కాప్యభిఖ్యా తయోరాసీ-**
**ద్వ్రజతోశ్శుద్ధవేషయోః।**
**హిమనిర్ముక్తయోర్యోగే**
**చిత్రాచన్ద్రమసోరివ।।** **46**



**పదవిభాగము :-** కా, అపి, అభిఖ్యా, తయోః, ఆసీత్, వ్రజతోః, శుద్ధవేషయోః హిమనిర్ముక్తయోః, యోగే, చిత్రాచన్ద్రమసోః, ఇవ।

**అన్వయక్రమము :-** వ్రజతోః శుద్ధవేషయోః హిమనిర్ముక్తయోః చిత్రాచన్ద్రమసోరివ యోగే (సతి) - కాపి అభిఖ్యా ఆసీత్।

**ప్రతిపదార్థము :-** వ్రజతోః - పోవుచున్నవారును, శుద్ధవేషయోః - నిర్మలములైన అలంకారములు కల, తయోః - ఆ సుదక్షిణాదిలీపులకు, హిమనిర్ముక్తయోః - మంచుచేత విడువబడిన, చిత్రాచన్ద్రమసోరివ - చిత్రానక్షత్రమునకు చంద్రునకువలె, యోగే (సతి) - సంబంధము కలుగుచుండ, కాపి - ఒకానొక, అభిఖ్యా - శోభ, ఆసీత్ - కలిగెను.

**తాత్పర్యము :-** నిర్మలవస్త్రధారులై గురువగు వసిష్ఠులవారి ఆశ్రమమునకు ఏగుచున్న ఆ సుదక్షిణాదిలీపులకు మంచుకాలమతిక్రమించిన పిదప చిత్రానక్షత్రచంద్రులకు వలె అనిర్వాచ్యమగు శోభ పొడమెను.

**విభక్తులు / క్రియలు :-** 1. కా - **కా**, కే, కాః; మకారాన్తః స్త్రీలిఙ్గః ప్రథమైకవచనాన్తః । 2. అపి - అవ్యయమ్। 3. అభిఖ్యా - **అభిఖ్యా**, అభిఖ్యే, అభిఖ్యాః; అభిఖ్యాశబ్దః అకారాన్తః స్త్రీలిఙ్గః ప్రథమైకవచనాన్తః। 4. తయోః - తస్య, **తయోః**, తేషామ్; దకారాన్తః పుల్లిఙ్గః షష్ఠీద్వివచనాన్తః। 5. ఆసీత్ - లఙ్ - ప్రథమపురుషైకవచనాన్తః క్రియాపదమ్। 6. వ్రజతోః - వ్రజతః, **వ్రజతోః**, వ్రజతామ్; వ్రజచ్ఛబ్దః తకారాన్తః పుల్లిఙ్గః షష్ఠీద్వివచనాన్తః। 7. శుద్ధవేషయోః - శుద్ధవేషస్య, **శుద్ధవేషయోః,** శుద్ధవేషాణామ్; శుద్ధవేషశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః షష్ఠీద్వివచనాన్తః। 8. హిమనిర్ముక్తయోః - హిమనిర్ముక్తస్య, **హిమనిర్ముక్తయోః**, హిమనిర్ముక్తానామ్; హిమనిర్ముక్తశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః షష్ఠీద్వివచనాన్తః। 9. యోగే - **యోగే,** యోగయోః, యోగేషు; యోగశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః సప్తమ్యేకవచనాన్తః। 10. చిత్రాచన్ద్రమసోః - చిత్రాచన్ద్రమశ్శబ్దః, సకారాన్తః పుల్లిఙ్గః నిత్యద్వివచనః, షష్ఠీద్వివచనాన్తః। 11. ఇవ - అవ్యయమ్।

**సమాసాలు :-**

1. శుద్ధవేషయోః - శుద్ధాః వేషాః యయోః తౌ శుద్ధవేషౌ (బ.), తయోః।
2. హిమనిర్ముక్తయోః - హిమేన నిర్ముక్తౌ హిమనిర్ముక్తౌ (తృ.త.), తయోః।
3. చిత్రాచన్ద్రమసోః - చిత్రా చ చన్ద్రమాశ్చ చిత్రాచన్ద్రమసౌ (ద్వం.), తయోః

**పాఠాన్తరాలు :-** 1. వేషయోః - వేశయోః

**సంధులు :-**

1. కా + అపి - కాపి - సవర్ణదీర్ఘసన్ధిః।
2. అపి + అభిఖ్యా - అప్యభిఖ్యా - యణాదేశసన్ధిః।
3. తయోః + ఆసీత్ - తయోరాసీత్ - విసర్గసన్ధిః (రేఫాదేశః)।
4. వ్రజతోః + శుద్ధవేషయాః - వ్రజతోశ్శుద్ధవేషయోః। **వా శరి** సూ. 8-3-36)।

శ ష స వర్ణములు పరముగానున్నప్పుడు విసర్గమునకు విసర్గమే వికల్పముగ వచ్చును. రాని పక్షమున విసర్గమునకు **విసర్జనీయస్య సః** అనుసూత్రముచే సకారము వచ్చి ఆ స కారమునకు, **స్తోఃశ్చునాశ్చుః** అనుసూత్రముచే శకారము వచ్చును.

5. హిమనిర్ముక్తయోః + యోగే - హిమనిర్ముక్తయోర్యోగే - విసర్గసన్ధిః ।
6. చిత్రాచన్ద్రమసోః + ఇవ - చిత్రాచన్ద్రమసోరివ - విసర్గసన్ధిః। (రేఫాదేశః)।

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు :-**

1. **అభిఖ్యా** - (స్త్రీ.) - కర్తరి - క్విప్।

ఎ) అభి + ఖ్యా + అజ్ + టాప్। కీర్తిః, శోభా।

బి) ఈ పదాన్ని వివరిస్తూ 'హలాయుధకోశ' వ్యాఖ్యానకారుడు - ఈ శ్లోకమునే ఉదాహరించినాడు.

శ్లో॥ చన్ద్రం గతా పద్మగుణాన్న భుఙ్క్తే
పద్మాశ్రితా చాన్ద్రమసీ**మభిఖ్యామ్।**
ఉమాముఖన్తు ప్రతిపద్యలోలా
ద్విసంశ్రయాం ప్రీతిమవాప లక్ష్మీః॥ - కు.సం. 1-43

శ్లో॥ రేఖావిభక్తస్సువిభక్తగాత్ర్యాః
కిఞ్చిన్మధూచ్ఛిష్టవిమృష్టరాగః।
కామ**ప్యభిఖ్యాం** స్ఫురితైరపుష్య-
దాసన్నలావణ్యఫలోఽధరోష్ఠః॥ - కు.సం. 7-18

"పార్వతీదేవియొక్క క్రింది పెదవి అదురులతో అనిర్వచనీయమైన **శోభను** పోషించెను."





**అలంకారాలు :-** అత్రోపమాలంకారః।

'అత్ర తయోర్యత్తథా వ్రజనమ్, ఉపమానయోశ్చ యో విశిష్టకాలభావీయోగః, తదుభయమపూర్వశోభాసంపాదనేన పరస్పరసాహాయ్యం నిర్వహతీత్యనుసంధేయమ్। ఉపమానే నిరావరణత్వముక్తమ్, ఉపమేయే తు పరిమేయపురస్సరత్వాదినా లభ్యతే।"
- అరుణగిరినాథః

**క్రియాదర్శము :-** ఆసీత్ - ఇంతకుముందు చెప్పబడినది.

**సంజీవినీ :-** కాఽపీతి. - వ్రజతోః గచ్ఛతోః, శుద్ధవేషయోః ఉజ్జ్వలనైపథ్యయోః , తయో, శ్చిత్రాచన్ద్రమసో రివ, యోగే సతి ఏకస్థానే విద్యమానయోః సతో రిత్యర్థః , కాప్యనిర్వాచ్యా, అభిఖ్యా శోభా, ఆసీత్. 'అభిఖ్యా నామశోభయోరిత్యమర శాశ్వత విశ్వ ప్రకాశాః. 'ఆతశ్చోపసర్గ.' ఇత్యఙ్ప్రత్యయః, చిత్రా నక్షత్రవిశేషః - శిశిరాపగమే చైత్ర్యాం చిత్రాపూర్ణచన్ద్రమసోరివేత్యర్థః.

---

**అవతారిక :-** మనోహరవస్తుదర్శనాత్ మార్గపరిశ్రమో న జ్ఞాతః -

**శ్లో॥ తత్తద్భూమిపతిః పత్న్యై**
**దర్శయన్ ప్రియదర్శనః।**
**అపి లంఘితమధ్వానం**
**బుబుధే న బుధోపమః॥ 47**

**పదవిభాగము :-** తత్తత్, భూమిపతిః, పత్న్యై, దర్శయన్, ప్రియదర్శనః, అపి, లంఘితమ్, అధ్వానమ్, బుబుధే, న, బుధోపమః।

**అన్వయక్రమము :-** ప్రియదర్శనః, బుధోపమః, భూమిపతిః పత్న్యై తత్తత్ దర్శయన్ లంఘితమపి అధ్వానం న బుబుధే।

**ప్రతిపదార్థము :-** ప్రియదర్శనః - ప్రియదర్శనుడును, బుధోపమః - బుధునితో సాటియైనవాడును అగు, భూమిపతిః - దిలీపమహారాజు, తత్తత్ - ఆయా వస్తువులను, పత్న్యై - భార్యయగు సుదక్షిణాదేవి కొఱకు, దర్శయన్ - చూపుచు, అధ్వానమ్ - దారి, లంఘితమపి - గడచినదైనను, న బుబుధే - గమనింపలేదాయె / తెలియరాదాయె.

**తాత్పర్యము :–** చూడముచ్చటైనవాడును, బుధునితో సాటియైనవాడును అగు దిలీపమహారాజుకు ఆ యా వాటిని భార్యయగు సుదక్షిణాదేవి కొఱకు చూపుచు దారి గడచినదైనను తెలియరాదాయె.

**విభక్తులు / క్రియలు :–** 1. తత్తత్ – **తత్తత్**, తేతే, తానితాని; తత్తచ్ఛబ్దః దకారాన్తః నపుంసకలింగః ద్వితీయైకవచనాన్తః। 2. భూమిపతిః – **భూమిపతిః,** భూమిపతీ, భూమిపతయః; భూమిపతిశబ్దః ఇకారాన్తః పుల్లిఙ్గః ప్రథమైకవచనాన్తః। 3. పత్న్యై – **పత్న్యై**, పత్నీభ్యాం, పత్నీభ్యః; పత్నీశబ్దః ఈకారాన్తః స్త్రీలిఙ్గః చతుర్థ్యేకవచనాన్తః। 4. దర్శయన్ – **దర్శయన్,** దర్శయన్తౌ, దర్శయన్తః; దర్శయచ్ఛబ్దః తకారాన్తః పుల్లిఙ్గః ప్రథమైకవచనాన్తః। 5. ప్రియదర్శనః – **ప్రియదర్శనః**, ప్రియదర్శనౌ, ప్రియదర్శనాః; ప్రియదర్శనశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః ప్రథమైకవచనాన్తః। 6. అపి – అవ్యయమ్। 7. లంఘితమ్ – **లంఘితమ్,** లంఘితౌ, లంఘితాన్; లంఘితశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః ద్వితీయైకవచనాన్తః। 8. అధ్వానమ్ – **అధ్వానమ్,** అధ్వానౌ, అధ్వనః; అధ్వన్‌శబ్దః నకారాన్తః పుల్లిఙ్గః ద్వితీయైకవచనాన్తః। 9. బుబుధే – లిట్ – ప్రథమపురుషైకవచనాన్తః। 10. న – అవ్యయమ్। 11. బుధోపమః – **బుధోపమః** , బుధోపమౌ, బుధోపమాః; బుధోపమశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః ప్రథమైకవచనాన్తః

**సమాసాలు :–**

1. భూమిపతిః – భూమ్యాః పతిః (ష.త.)।
2. ప్రియదర్శనః – ప్రియం దర్శనం యస్య సః ప్రియదర్శనః (బ.)।
3. బుధోపమః – బుధః ఉపమా యస్య సః బుధోపమః (బ.)।

**పాఠాన్తరాలు :–**

1. అపి లంఘిత... – అతిలంఘిత...।

**అలంకారాలు :–** ఇందు విరోధాభాసాలంకారమున్నదని చెప్పదగును. తల్లక్షణం యథా –

'విరోధః సోऽ విరోధేऽ పి విరుద్ధత్వేన యద్వచః'

– కావ్యప్రకాశే – 10–23

"ప్రియదర్శనోऽ పూర్వస్తు ద్రష్టా, బుధశ్చన్ద్రపుత్రో గ్రహస్తేన। తుల్యోऽ పి న బుబుధే' ఇతి విరోధాభాసాలంకారః। – ఇతి శిశుహితైషిణీ





**క్రియాదర్శము :– బుబుధే** – 'బుధ – అవగమనే', ఇత్యస్మాద్ధాతోస్సకర్మకాత్కర్తరి భూతే లిటి ఆత్మనేపదే ప్రథమపురుషైకవచనాన్తః।

**బుబుధే** – బుబుధాతే – బుబుధిరే

**సంజీవినీ :–** తత్తదితి. – ప్రియం దర్శనం స్వకర్మకం యస్యాసౌ ప్రియదర్శనః – దర్శనీయ ఇత్యర్థః, బుధోపమో, భూమిపతిః, పత్న్యై తత్త దద్భుతం వస్తుదర్శయన్ లంఘితమపి అధ్వానం, న బుబుధే న జ్ఞాతవాన్; బుధః సౌమ్య ఉపమా ఉపమానం యస్యేతి విగ్రహః. ఇదం విశేషణం 'తత్త ద్దర్శ'య న్నిత్యత్రోపయోగితయైతస్య జ్ఞాతృత్వసూచనార్థమ్.

---

**అవతారిక :–** తౌ సాయం వసిష్ఠాశ్రమం ప్రాపతుః –

**శ్లో॥ స దుష్ప్రాపయశాః ప్రాప –**
**దాశ్రమం శ్రాన్తవాహనః।**
**సాయం సంయమినస్తస్య**
**మహర్షేర్మహిషీసఖః॥ 48**

**పదవిభాగము :–** సః, దుష్ప్రాపయశాః, ప్రాపత్, ఆశ్రమమ్, శ్రాన్తవాహనః, సాయమ్, సంయమినః, తస్య, మహర్షేః, మహిషీసఖః।

**అన్వయక్రమము :–** దుష్ప్రాపయశాః శ్రాన్తవాహనః మహిషీసఖః సః సాయం సంయమినః తస్య మహర్షేః ఆశ్రమం ప్రాపత్।

**ప్రతిపదార్థము :–** దుష్ప్రాపయశాః – పొందరాని కీర్తికలట్టియు, శ్రాన్తవాహనః – అలసిన అశ్వములు గలట్టియు, మహిషీసఖః – భార్యాసమేతుడు అగు, సః – ఆ దిలీపమహారాజు, సాయమ్ – సాయంకాలమునందు, సంయమినః – నియమ వంతుడగు, తస్య మహర్షేః – ఆ వసిష్ఠమహర్షియొక్క, ఆశ్రమమ్ – ఆశ్రమమును, ప్రాపత్ – పొందెను / చేరెను.

**తాత్పర్యము :–** పొందరాని కీర్తికలట్టియు, అలసిన అశ్వములు గలట్టియు, భార్యాసమేతుడగు ఆ దిలీపమహారాజు సాయంకాలమునందు నియమవంతుడగు వసిష్ఠమహర్షియొక్క ఆశ్రమమును చేరెను.

**విభక్తులు / క్రియలు :-** 1. సః - **సః,** తే, తౌ; తచ్ఛబ్దః దకారాన్తః పుల్లిఙ్గః ప్రథమైకవచనాన్తః। 2. దుష్ప్రాపయశాః - **దుష్ప్రాపయశాః,** దుష్ప్రాపయశౌ, దుష్ప్రాపయశసః; దుష్ప్రాపయశశ్శబ్దః సకారాన్తః పుల్లిఙ్గః ప్రథమైకవచనాన్తః। 3. ప్రాపత్ - లుఙ్, ప్రథమపురుషైకవచనాన్తః। క్రియాపదమ్। 4. ఆశ్రమమ్ - **ఆశ్రమమ్,** ఆశ్రమౌ, ఆశ్రమాన్; ఆశ్రమశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః ద్వితీయైకవచనాన్తః । 5. శ్రాన్తవాహనః - **శ్రాన్తవాహనః,** శ్రాన్తవాహనౌ, శ్రాన్తవాహనాః; శ్రాన్తవాహనశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః ప్రథమైకవచనాన్తః। 6. సాయమ్ - అవ్యయమ్। 7. సంయమినః - **సంయమినః,** సంయమినోః, సంయమినామ్; సంయమిన్‌శబ్దః నకారాన్తః పుల్లిఙ్గః షష్ఠ్యేకవచనాన్తః। 8. తస్య - **తస్య,** తయోః, తేషామ్; తచ్ఛబ్దః దకారాన్తః పుల్లిఙ్గః షష్ఠ్యేకవచనాన్తః। 9. మహర్షేః - **మహర్షేః,** మహర్ష్యోః, మహర్షీణామ్; మహర్షిశబ్దః ఇకారాన్తః పుల్లిఙ్గః షష్ఠ్యేకవచనాన్తః। 10. మహిషీసఖః - **మహిషీసఖః,** మహిషీసఖౌ, మహిషీసఖాః; మహిషీసఖశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః ప్రథమైకవచనాన్తః।

**సమాసాలు :-**

1. దుష్ప్రాపయశాః - దుఃఖేన ప్రాప్తుం శక్యం దుష్ప్రాపం, దుష్ప్రాపం యశః యస్య సః దుష్ప్రాపయశాః (బ.)।
2. శ్రాన్తవాహనః - శ్రాన్తాని వాహనాని యస్య సః శ్రాన్తవాహనః (బ.)।
3. సంయమినః - సంయమః అస్యాస్తీతి సంయమీ, తస్య।
4. మహర్షేః - మహాంశ్చాసౌ ఋషిశ్చ మహర్షిః। (వి.పు.క.) తస్య।
5. మహిషీసఖః - మహిష్యాః సఖా మహిషీసఖః, (ష.త.)।

**సంధులు :-**

1. దుష్ప్రాపయశాః దుః + ప్రాపయశాః - విసర్గసన్ధిః (షకారాదేశః)।
2. సంయమినః + తస్య - సంయమినస్తస్య - విసర్గసన్ధిః (సకారాదేశః)।
3. మహర్షేః + మహిషీసఖః - మహర్షేర్మహిషీసఖః - విసర్గసన్ధిః (రేఫాదేశః)।

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు :-**

**1. సాయమ్** - అవ్యయమ్।

ఎ) దినావసానమస్యార్థః। '**సాయం** సంయమినస్తస్య మహర్షేర్మహిషీసఖః। సాయన్తనో వాయుః'। అని అవ్యయకోశ' వ్యాఖ్యానకారుడు దీనికి ఈ శ్లోకమునే ఉదాహరణముగ చూపినాడు.





బి) స్యతి సమాపయతి దినమితి। షో + బహులకాద్ ఇమ్ యుగాగమశ్చ। సాయాహ్నః సన్ధ్యా; **సాయం**కాలః।

- అని 'హలాయుధకోశ'కారుడున్ను దీనికి ఈ శ్లోకమునే ఉదాహరణముగా చూపినాడు.

సి) శ్లో॥ వధూర్భక్తిమతీ చైనామర్చితామా తపోవనాత్।
ప్రయతా ప్రాతరన్వేతు **సాయం** ప్రత్యుద్వ్రజేదపి॥ - ర.వం. 1-90

ఆప్టే మహాశయుడున్నూ ప్రస్తుత శ్లోకమును, ఈ పై శ్లోకమును కూడ ఉదాహరణముగ చూపినాడు.

**2. మహిషీసఖః :-** ఇట 'నందార్గికర్' వ్యాఖ్య చూడవలయును. దీనితోబాటు పాణిని 5-4-91ను కూడ పరిశీలించగలరు. ఇంకను ఈ సర్గమునందలి 1-95వ శ్లోకమును మఱియు 2 -24 శ్లోకమును కూడ ఈ సందర్భమున సునిశిత పరిశీలన చేయగలరు.

**క్రియాదర్శము :- ప్రాపత్** - 'ప్ర' ఇత్యుపసర్గపూర్వకాత్, 'ఆప్ వ్యాప్తౌ', ఇత్యస్మాద్ధాతోస్సకర్మకాత్కర్తరి భూతే లుఙి పరస్మైపదే ప్రథమపురుషైకవచనాన్తః।

**ప్రాపత్** - ప్రాపతాం - ప్రాపన్।
తేనాశ్రమః ప్రాప్యత। కర్మణిప్రయోగః।

**సంజీవినీ :-** స ఇతి దుష్ప్రాపయశాః దుష్ప్రాపమన్యదుర్లభం యశో యస్య స తథోక్తః, శ్రాన్తవాహనః దూరగమనాత్ క్లాన్తయుగ్యః, మహిష్యాః సఖా మహిషీసఖః. 'రాజాహస్సఖిభ్యష్ట జి' తి టచ్ప్రత్యయః - సహాయాన్తరనిరపేక్ష ఇతి భావః, స రాజా, సాయం సాయంకాలే, సంయమినః నియమవతః తస్య మహర్షేర్వసిష్ఠస్య, ఆశ్రమం, ప్రాపత్ ప్రాప్తః. పుషాదిత్వా దఙ్.

---

**అవతారిక :-** ఆశ్రమవర్ణనా -

**శ్లో॥ వనాన్తరాదుపావృత్తైః**
**సమిత్కుశఫలాహరైః।**
**పూర్యమాణమదృశ్యాగ్ని** | **అగ్నిప్రత్యుద్గమాత్పూతైః**
**ప్రత్యుద్యాతైస్తపస్విభిః॥** | **పూర్యమాణం తపస్విభిః॥ 49**

**పదవిభాగము :-** వనాన్తరాత్, ఉపావృత్తైః, సమిత్కుశఫలాహరైః, పూర్యమాణమ్, అదృశ్యాగ్నిప్రత్యుద్యాతైః, తపస్విభిః।

**అన్వయక్రమము :-** వనాన్తరాత్ ఉపావృత్తైః సమిత్కుశఫలాహరైః అదృశ్యాగ్ని ప్రత్యుద్యాతైః తపస్విభిః పూర్యమాణమ్ (ఆశ్రమమ్ ప్రాపత్।)

**ప్రతిపదార్థము :-** వనాన్తరాత్ - ఇతర వనములనుండి, ఉపావృత్తైః - తిరిగి వచ్చినవారును, సమిత్ - కుశ - ఫల - ఆహరైః - సమిధలను, దర్భలను, ఫలములను తెచ్చుచున్న వారును, అదృశ్య - అగ్ని - ప్రత్యుద్యాతైః - అగుపడని త్రేతాగ్నులచేత ఎదుర్కొనబడినవారును అగు, తపస్విభిః - ఋషులచేత, పూర్యమాణమ్ - నింపబడుచున్నది అగు (ఆశ్రమమ్ ప్రాపత్।)

**తాత్పర్యము :-** ఇతర వనములనుండి సమిధాదులను తెచ్చుచున్నవారును, అగుపడని త్రేతాగ్నులచే ఎదురుకొనబడినవారును అగు, ఋషులచేత నింపబడుచున్నదియగు (వసిష్ఠాశ్రమమునకు భార్యాసమేతుడగు దిలీపమహారాజు చేరెను.)

**విభక్తులు / క్రియలు :-** 1. వనాన్తరాత్ **- వనాన్తరాత్,** వనాన్తరాభ్యాం, వనాన్తరేభ్యః ; వనాంతరశబ్దః అకారాన్తః నపుంసకలిఙ్గః పఞ్చమ్యేకవచనాన్తః। 2. ఉపావృత్తైః - ఉపావృత్తేన, ఉపావృత్తాభ్యాం, **ఉపావృత్తైః**; ఉపావృత్తశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః తృతీయాబహువచనాన్తః। 3. సమిత్...ఆహరైః - ...ఆహరేణ, ...ఆహరాభ్యాం, **...ఆహరైః**; సమిత్...ఆహరశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః తృతీయాబహువచనాన్తః। 4. పూర్యమాణమ్ - **పూర్యమాణమ్**, పూర్యమాణౌ, పూర్యమాణాన్; పూర్యమాణశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః ద్వితీయైకవచనాన్తః। 5. అదృశ్యాగ్నిప్రత్యుద్యాతైః - ...ప్రత్యుద్యాతేన, ...ప్రత్యుద్యాతాభ్యాం, **...ప్రత్యుద్యాతైః**; ...ప్రత్యుద్యాతశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః తృ.బ.। 6. తపస్విభిః - తపస్వినా, తపస్విభ్యాం, **తపస్విభిః**; తపస్విన్‌శబ్దః నకారాన్తః పుల్లిఙ్గః తృతీయాబహువచనాన్తః।

**సమాసాలు :-**

1. వనాన్తరాత్ - అన్యత్ వనం వనాంతరం, తస్మాత్।
2. సమిత్కుశఫలాహరైః - సమిధశ్చ కుశాశ్చ ఫలాని చ, సమిత్కుశఫలాని (ద్వం.) సమిత్కుశఫలాని ఆహర్తుం శీలమ్ ఏషామితి, సమిత్కుశఫలాహరాః (తద్ధి.) తైః।





3. అదృశ్యాగ్నిప్రత్యుద్యాతైః - న దృశ్యాః, అదృశ్యాః (నఞ్‌త.) అదృశ్యాశ్చ తే అగ్నియశ్చ, అదృశ్యాగ్నయః (వి.పూ.క.), అదృశ్యాగ్నిభిః। ప్రత్యుద్యాతాః, అదృశ్యాగ్ని ప్రత్యుద్యాతాః (తృ.త) తైః।

**పాఠాన్తరాలు :-** శ్లోకభాగము - చూడండి.

1. స్కన్ధాసక్తసమిత్కుశైః - స్కన్ధాసక్తసమిత్కుశైః - సమిత్కుశఫలాహరైః

**సంధులు :-**

1. ...ప్రత్యుద్యాతైః + తపస్విభిః - ...ప్రత్యుద్యాతైస్తపస్విభిః - విసర్గసన్ధిః (సకారాదేశః)।

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు :-**

**1. సమిత్** (ధ్) (స్త్రీ.) :-

ఎ) **సమిధ్యతేఽ**నయేతి। సమ్ + ఇన్ధ్ + క్విప్, తుక్।

బి) **శ్లో॥ అర్కః పలాశః ఖదిరస్త్వపామార్గోఽథ పిప్పలః।**
**ఉదుమ్బరః శమీ దూర్వాః కుశాశ్చ సమిధః క్రమాత్॥**

**- ఇతి యాజ్ఞవల్క్యః।**

2. శ్లో॥ ప్రాదేశమాత్రాః సశిఖాః సవల్కాశ్చ పలాశినీః।
**సమిధః** కల్పయేత్ ప్రాజ్ఞః సర్వకర్మసు సర్వదా॥

- ఇతి మత్స్యపురాణే

3. శ్లో॥ నిత్యం స్నాత్వా శుచిః కుర్యాద్ దేవర్షిపితృతర్పణమ్।
దేవతాభ్యర్చనం చైవ **సమిదాధానమేవ** చ॥ - ఇతి మనుః 2/176

4. శ్లో॥ "ఏధస్తర్పణమిన్ధనమేధః **సమిదిధ్మ** ఇత్యభిన్నార్థాః॥"
అని హలాయుధకోశము '6' నామములను పేర్కొన్నది.

5. శ్లో॥ తత్రాగ్నిమాధాయ **సమిత్స**మృద్ధం
స్వమేవ మూర్త్యన్తరమష్టమూర్తిః।
స్వయం విధాతా తపసః ఫలానాం
కేనాపి కాయేన తపశ్చచార॥ - కు.సం. 1-57

6. శ్లో॥ అయన్తు మామాత్మభవస్తవాదర్శనమారుతః।
విలాపదుఃఖ**సమిధో** రుదితాశ్రుహుతాహుతిః ॥

- శ్రీమద్రామయణే 2-24-6

"...విలాపదుఃఖములే సమిధలు..."

2. 1. అదృశ్యాగ్నిప్రత్యుద్యాతైః తపస్విభిః - ఇట శ్రీకాళిదాసకవితావైభవము ఇలా చెప్పినది.

'అరణ్యమునకు / ప్రవాసమునకు బోయి సమిధలు మున్నగువానిని తీసికొని వెనుతిరిగివచ్చే ఆహితాగ్నులకు వైతానాగ్నులు, అదృశ్యరూపముతో ప్రవాసమునుండి వచ్చు తండ్రికి (బుత్రులువోలె- ఎదురేగు నని శ్రుతి యిట్లు చెప్పుచున్నది.'

'కామం పితరం పుత్రాః ప్రోషితవంతం ప్రత్యాధావన్తి ఏవమేతం అగ్నయః ప్రత్యాధావన్తి, స శకలాన్దారూని వాహరన్నితి' ఏతాదృశవిశేష విషయములను పఠితలకు బోధించుట కాళిదాసునకు మిక్కిలి యిష్టము.

**సంజీవినీ** :- తమాశ్రమం విశనష్టి - వనాన్తరా దితి. - వనాన్తరా దన్యస్మా ద్వనాత్, ఉపావృత్తైః ప్రత్యాగతైః, సమిధశ్చ కుశా శ్చ ఫలాని చ ఆహర్తుం శీలమేషా మితి సమిత్కుశఫలాహరాః - తైః, 'ఆజీ తాచ్ఛీల్య' ఇతి హరతే రాజ్బూర్వా దచ్ప్రత్యయః , అదృశ్యై ర్దర్శనాయోగ్యైః - అగ్నిభి ర్వైతానికైః - ప్రత్యుద్యాతాః ప్రత్యుద్గతాః - తైః , తపస్విభిః, పూర్యమాణం వ్యాప్యమానం; ప్రో ష్యాగచ్ఛతా మాహితాగ్నీనామ్ అగ్ని ప్రత్యుద్యానం శ్రుతిప్రసిద్ధ మేవ.

---

**అవతారిక** :- ఆశ్రమద్వారే మృగాః ఋషీణామపత్యానీవ క్రీడన్తి స్మ -

**శ్లో॥ ఆకీర్ణమృషిపత్నీనా-**
**ముటజద్వారరోధిభిః।**
**అపత్యైరివ నీవార -**
**భాగధేయోచితైర్మృగైః॥** **50**

**పదవిభాగము** :- ఆకీర్ణమ్, ఋషిపత్నీనామ్, ఉటజద్వారరోధిభిః, అపత్యైః, ఇవ, నీవారభాగధేయోచితైః, మృగైః।





**అన్వయక్రమము** :- నీవారభాగధేయోచితైః ఉటజద్వారరోధిభిఃమృగైః ఋషిపత్నీనాం అపత్యైరివ ఆకీర్ణమ్...।

**ప్రతిపదార్థము** :- నీవార - భాగధేయ - ఉచితైః - నెవ్వరిధాన్య భాగమునకు అలవాటుపడినవియు, ఉటజ - ద్వార - రోదిభిః - పర్ణశాలల ద్వారములను అడ్డగించునవియు, ఋషిపత్నీనామ్ - ఋషిభార్యలయొక్క, అపత్యైః + ఇవ - బిడ్డలవలె నున్నవి యగు, మృగైః - లేళ్లచేత, ఆకీర్ణమ్ - వ్యాప్తమైనదియగు, (ఆశ్రమమ్ ప్రాపత్)

**తాత్పర్యము** :- నెవ్వరి ధాన్యభాగమునకు అలవాటుపడినవియు, పర్ణశాలల ద్వారములను అడ్డగించునవియు, ఋషిభార్యలయొక్క బిడ్డలవలె నున్నవియగు లేళ్లచేత వ్యాప్తమైన ఆశ్రమమునకు ఆ దిలీపుడు సపత్నీకుడై చేరెను.

**విభక్తులు / క్రియలు** :- 1. ఆకీర్ణమ్ - **ఆకీర్ణమ్**, ఆకీర్ణౌ, ఆకీర్ణాన్; ఆకీర్ణశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః ద్వితీయైకవచనాన్తః। 2. ఋషిపత్నీనామ్ - ఋషిపత్న్యాః, ఋషిపత్న్యోః, **ఋషిపత్నీనామ్;** ఋషిపత్నీశబ్దః ఈకారాన్తః స్త్రీలిఙ్గః షష్ఠీబహు వచనాన్తః। 3. ఉటజద్వారరోధిభిః - ఉటజద్వారరోధినా, ఉటజద్వారరోధిభ్యాం, **ఉటజద్వారరోధిభిః**; ఉటజద్వారరోధిన్‌శబ్దః నకారాన్తః పుల్లిఙ్గః తృ.బ.। 4. అపత్యైః - అపత్యేన, అపత్యాభ్యాం, **అపత్యైః**; అపత్యశబ్దః అకారాన్తః నపుంసకలిఙ్గః తృ.బ.। 5. ఇవ -అవ్యయమ్। 6. నీవారభాగధేయోచితైః - ...ఉచితేన, ...ఉచితాభ్యాం, **...ఉచితైః**; ...ఉచితశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః తృ.బ.। 7. మృగైః - మృగేణ, మృగాభ్యాం, **మృగైః**; మృగశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః తృ.బ.।

**సమాసాలు** :-

1. ఋషిపత్నీనామ్ - ఋషీణాం పత్న్యః ఋషిపత్న్యః (ష.త.), తాసామ్।
2. ఉటజద్వారరోదిభిః - ఉటజానాం ద్వారాణి ఉటజద్వారాణి (ష.త.), ఉటజద్వారాణి రుంధన్తీతి ఉటజద్వారరోధినః (కృ.), తైః।
3. నీవారభాగధేయోచితైః - నీవారాణాం భాగధేయాని నీవారభాగధేయాని (ష.త.), నీవారభాగధేయానాం ఉచితాః నీవారభాగధేయోచితాః (ష.త.) తైః

**సంధులు** :-

1. అపత్యైః + ఇవ - అపత్యైరివ - విసర్గసన్ధిః (రేఫాదేశః)।

2. ...ఉచితైః + మృగైః - ఉచితైర్మృగైః - విసర్గసన్ధిః।

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు :-**

**1. ఆకీర్ణం -** ఈ పద ప్రయోగమునకై 'కిరాతార్జునీయమహాకావ్య'మున 7వ సర్గము - 36వ శ్లోకమును చూడండి.

1. శ్లో॥ **ఆకీర్ణం** బలరజసా ఘనారుణేన
ప్రక్షోభైః సపది తరంగితం తటేషు।
మాతంగోన్మథితసరోజరేణుపింగం
మాంజిష్ఠం వసనమివాంబు నిర్బభాసే॥ - కిరాతే 7-36

'మిక్కిలి ఎరుపైన సేనవలన లేచిన దుమ్ముతో వ్యాపించునది..."

2. శ్లో॥ మహాభాగః కామం నరపతిరభిన్నస్థితిరసౌ
న కశ్చిద్వర్ణానామపథమపకృష్టోఽపి భజతే।
తథాపీదం శశ్వత్పరిచితవివిక్తేన మనసా
**జనాకీర్ణం** మన్యే హుతవహపరీతం గృహమివ॥ - అ.శా. 5-10

"...జనులతో వ్యాప్తమైన ఈ పట్టణము ఎల్లపుడు..."

3. ఆకీర్ణం మణ్డలం సర్వం మిత్త్రైరరిభిరేవ చ। -కామందకీయనీతిసారే - 8-13

**అలంకారాలు :-** అత్రోపమాలంకారః।

**సంజీవినీ :-** ఆకీర్ణమితి - నీవారాణాం తృణధాన్యానాం - భాగ ఏవ భాగధేయ మంశః. 'భాగరూపనామభ్యో ధేయో వాచ్య' ఇతి స్వార్థే ధేయ ప్రత్యయః తస్యోచితైః , అత ఏవ - ఉటజానాం పర్ణశాలానాం - ద్వారరోధిభిః - ద్వారావరోధకైః, మృగైః, ఋషిపత్నీనామ్, అపత్యైరివ ఆకీర్ణం వ్యాప్తమ్.

---

**అవతారిక :-** మునికన్యకాః వృక్షసేచనమకుర్వన్ -

**శ్లో॥ సేకాన్తే మునికన్యాభిః**
**తత్క్షణోజ్ఝితవృక్షకమ్।**
**విశ్వాసాయ విహఙ్గానా-**
**మాలవాలామ్బుపాయినామ్॥** **51**



**పదవిభాగము :-** సేకాన్తే, మునికన్యాభిః, తత్‌క్షణోజ్ఝితవృక్షకమ్, విశ్వాసాయ, విహంగానాం, ఆలవాలామ్బుపాయినామ్।

**అన్వయక్రమము :-** సేకాన్తే మునికన్యాభిః ఆలవాలామ్బుపాయినాం విహంగానాం విశ్వాసాయ తత్‌క్షణోజ్ఝితవృక్షకమ్...।

**ప్రతిపదార్థము :-** సేకాన్తే - నీళ్లు (మొక్కల మొదళ్లలో) పోసిన తర్వాత, మునికన్యాభిః - మునికన్యలచేత, ఆలవాల - అంబు - పాయినామ్ - (మొక్కల) మొదళ్ల యందలి నీటిని త్రాగెడి, విహంగానామ్ - పక్షులయొక్క, విశ్వాసాయ - విశ్వాసముకొఱకు, తత్‌క్షణోజ్ఝితవృక్షకమ్ - ఆ క్షణమందు వదలిపెట్టబడిన చిన్నవృక్షములు కలట్టియు, (ఆశ్రమమ్ ప్రాపత్।)

**తాత్పర్యములు :-** మునికన్యలచేత మొక్కల మొదళ్లలో నీళ్లు పోయబడిన పిదప యందలి నీటిని త్రాగెడి పక్షుల విశ్వాసము కొఱకు ఆ క్షణమందే వదలిపెట్టబడిన చిన్నవృక్షములు కలట్టి వశిష్ఠాశ్రమమునకు సపత్నీకుడై దిలీపుడు చేరెను.

**విభక్తులు / క్రియలు :-**1. సేకాన్తే - **సేకాన్తే**, సేకాన్తయోః, సేకాన్తేషు; సేకాన్తశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః సప్తమ్యేకవచనాన్తః। 2. మునికన్యాభిః - మునికన్యయా, మునికన్యాభ్యాం, **మునికన్యాభిః**; మునికన్యాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః తృ.బ.। 3. తత్‌క్షణోజ్ఝితవృక్షకమ్ - **...వృక్షకమ్,** ...వృక్షకౌ, ...వృక్షకాన్; ...వృక్షకశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః ద్వితీయైకవచనాన్తః। 4. విశ్వాసాయ - **విశ్వాసాయ,** విశ్వాసాభ్యాం, విశ్వాసేభ్యః; విశ్వాసశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః చతుర్థ్యేకవచనాన్తః। 5. విహంగానామ్ - విహంగస్య, విహంగయోః, **విహంగానామ్**; విహంగశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః షష్ఠీబహువచనాన్తః। 6. ఆలవాలంబుపాయినామ్ - ...పాయినః, ...పాయినోః, **...పాయినామ్**; ...పాయిన్‌శబ్దః నకారాన్తః పుల్లిఙ్గః షష్ఠీబహువచనాన్తః।

**సమాసాలు :-**

1. మునికన్యాభిః - మన్యన్తే ఇతి మునయః, మునీనాం కన్యాః మునికన్యాః (ష.త.) తాభిః।
2. తత్‌క్షణోజ్ఝితవృక్షకమ్ - తస్య క్షణః తత్‌క్షణః (ష.త.), తత్‌క్షణం ఉజ్ఝితాః తత్‌క్షణోజ్ఝితాః, అల్పాః వృక్షాః వృక్షకాః, తత్‌క్షణోజ్ఝితాః వృక్షకాః యస్మిన్ సః , తత్‌క్షణోజ్ఝితవృక్షకః (బ.) తమ్।
3. విహంగానామ్ - విహాయసి గచ్ఛన్తీతి విహంగాః (కృ.) తేషామ్।

4. సేకాన్తే - సేకస్య అంతః సేకాన్తః (ష.త.), తస్మిన్।
5. ఆలవాలంబుపాయినామ్ - ఆలవాలేషు అంబూని ఆలవాలాంబూని (స.త.), ఆలవాలాంబూని పిబన్తీతి ఆలవాలాంబుపాయినః (కృ.), తేషామ్।

**పాఠాన్తరాలు :-** విశ్వాసాయ - **విస్రంభాయ**

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు :- 1. విస్రంభః -**

ఎ) 'సమౌ **విస్రంభ**విశ్వాసౌ' - అని అమరకోశము

బి) (పుం.) - 1. వి + స్రమ్భు + ఘఞ్ । విశ్వాసః।

2. '**విస్రమ్భా**దురసి నిపత్య లబ్ధనిద్రామ్' - ఇతి ఉత్తరరామచరితే।
3. విస్రమ్భ, విశ్రబ్ధ, విస్రబ్ధ, విశ్రమ్భ - పదాలు ఒకే అర్థాన్ని కలిగి ఉంటాయి.
4. '**...విశ్రమ్భః** కథ్యతే చ విశ్వాసః'।

- అని హలాయుధకోశము

**సంజీవినీ :-** సేకాన్తే ఇతి - సేకాన్తే వృక్షమూల సేచనావసానే, మునికన్యాభిః సేక్త్రీభిః - ఆలవాలేషు జలావాపవలయేషు - య దమ్బు - తత్పాయినాం - 'స్యాదాలవాల మావాల మవాప' ఇత్యమరః. విహఙ్గానాం పక్షినాం, విస్రమ్భాయ విశ్వాసాయ. 'సమౌ విస్రమ్భవిశ్వాసౌ' విత్యమరః, తత్క్షణే సేచనక్షణే - ఉజ్ఝితాః - వృక్షకాః బాలవృక్షాః - యస్మిన్ - తమ్. అల్పార్థే కన్ ప్రత్యయః.

---

**అవతారిక :-** ఉటజాఙ్గణభూమిషు విస్రమ్భేణనిషణ్ణా మృగాః -

**శ్లో॥ ఆతపాత్యయసంక్షిప్త-**
**నీవారాసు నిషాదిభిః।**
**మృగైర్వర్తితరోమన్థ-**
**ముటజాఙ్గణభూమిషు॥** **52**

**పదవిభాగము :-** ఆతపాత్యయసంక్షిప్తనీవారాసు, నిషాదిభిః, మృగైః, వర్తితరోమన్థమ్, ఉటజాఙ్గణభూమిషు।

**అన్వయక్రమము :-** ఆతప...నీవారాసు ఉటజ - అంగణభూమిషు నిషాదిభిః మృగైః వర్తితరోమన్థమ్...।





**ప్రతిపదార్థము :-** ఆతప - అత్యయ - సంక్షిప్త - నీవారాసు - ఎండిపోవుటచే ప్రోగు చేయబడిన నీవార ధాన్యముకల, ఉటజ - అంగణభూమిషు - పర్ణశాలల ముంగిళ్లయందు, నిషాదిభిః - పరుండియున్న, మృగైః - లేళ్లచేత, వర్తిత - రోమన్థమ్ - నెమరువేయుచుండుట కలదియు అగు... (ఆశ్రమం ప్రాపత్।)

**తాత్పర్యము :-** ఎండిపోవుటచే ప్రోగుచేయబడిన నీవారధాన్యముగల పర్ణశాలల ముంగిళ్లయందు పరుండి నెమరువేయుచున్న లేళ్లు కలదియు అగు ఆశ్రమమునకు దిలీపుడు సపత్నీకుడై చేరెను.

**విభక్తులు / క్రియలు :-** ఆతప...నీవారాసు - ...వీవారాయాం, ...నీవారయోః, **...నీవారాసు**; ...నీవారాశబ్దః ఆకారాన్తః స్త్రీలింగః సప్తమీబహువచనాన్తః। 2. నిషాదిభిః - నిషాదినా, నిషాదిభ్యాం, **నిషాదిభిః**; నిషాదిన్‌శబ్దః నకారాన్తః పుల్లిఙ్గః తృ.బ.। 3. మృగైః - మృగేణ, మృగాభ్యాం, **మృగైః**; మృగశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః తృ.బ.। 4. వర్తితరోమన్థమ్ - **వర్తితరోమన్థమ్**, వర్తితరోమన్థౌ, వర్తితరోమన్థాన్; వర్తితరోమన్థశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః ద్వితీయైకవచనాన్తః। 5. ఉటజాఙ్గణభూమిషు - ...భూమ్యాం, ...భూమ్యోః, **...భూమిషు;**...భూమిశబ్దః ఇకారాన్తః స్త్రీలిఙ్గః సప్తమీబహువచనాన్తః।

**సమాసాలు :-**

1. ఆతపాత్యయసంక్షిప్తనీవారాసు - ఆతపస్య అత్యయః, ఆతపాత్యయః (ష.త.), ఆతపాత్యయేన సంక్షిప్తాః ఆతపాత్యయసంక్షిప్తాః (తృ.త.), ఆతపాత్యసంక్షిప్తాః నీవారాః యాసు తాః ఆతపాత్యయసంక్షిప్తనీవారాః (బ.), తాసు।
2. వర్తితరోమన్థమ్ - వర్తితః రోమన్థః యస్మిన్ సః వర్తితరోమన్థః (బ.) తమ్।
3. ఉటజాఙ్గణభూమిషు - అఙ్గణానాం భూమయః అంగణభూమయః (ష.త.), ఉటజానాం అంగణభూమయః, ఉటజాఙ్గణభూమయః (ష.త.), తాసు।

**పాఠాన్తరాలు :-** 1. ఆతపాత్యాయ...-ఆతపాపాయ....

**సంధులు :-**

1. మృగైః + వర్తితరోమన్థమ్ - మృగైర్వర్తితరోమన్థమ్ - విసర్గసన్ధిః।

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు :-**

**1. రోమన్థః** - ఎ) రోగం మధ్నాతి। మన్థ్ - అణ్। పృషో... గలోపః।

బి) 'ఉద్గీర్ణస్య వా అవగీర్ణస్య వా మన్థో **రోమన్థః**' - మహాభారతమ్।

సి) 'మహాకవి కాళిదాసు రచించిన 'అభిజ్ఞానశాకున్తలమ్' - 2 - 6వ శ్లోకము. ఈ దిగువనీయబడినది. చూడుడు.

శ్లో॥ గాహన్తాం మహిషాః నిపానసలిలం శృంగైర్ముహుస్తాడితం
ఛాయాబద్ధకదమ్బకం మృగకులం **రోమన్థ**మభ్యస్యతు।
**విస్రబ్ధం** క్రియతాం వరాహతతిభిర్ముస్తాక్షతిః పల్వలే
విశ్రామం లభతామిదం చ శిథిలజ్యాబంధమస్మద్ధనుః॥

"చెట్లయొక్క చల్లని నీడలయందు లేళ్లు గుమిగూడి నెమరు వేయనిమ్ము..."

**సంజీవినీ :-** ఆతపేతి. - ఆతప - స్యాత్యయే అపగమే సతి - సంక్షిప్తాః రాశీ కృతాః - నీవారాః తృణధాన్యాని యాసు తాసు. 'తృణధాన్యాని నీవారా' ఇత్యమరః , ఉటజానాం పర్ణశాలానామ్ - అఙ్గణభూమిషు చత్వరభాగేషు - 'పర్ణశాలోటజోఽ స్త్రియాం, 'అఙ్గణం చత్వరాజిరే' ఇతి చామరః, నిషాదిభి రుపవిష్టైః, మృగై, ర్వర్తితో నిష్పాదితో - రోమన్థ శ్చర్వితచర్వణం - యస్మిన్ ఆశ్రమే తమ్.

---

**అవతారిక :-** ఆహుతిగన్ధిభిః ధూమైరతిథయః పూతాః -

**శ్లో॥ అభ్యుత్థితాగ్నిపిశునై-**
**రతిథీనాశ్రమోన్ముఖాన్।**
**పునానం పవనోద్ధూతై-**
**ర్ధూమైరాహుతిగన్ధిభిః॥** **53**

**పదవిభాగము :-** అభ్యుత్థితాగ్నిపిశునైః, అతిథీన్, ఆశ్రమోన్ముఖాన్, పునానమ్, పవనోద్ధూతైః, ధూమైః, ఆహుతిగన్ధిభిః।

**అన్వయక్రమము :-** అభ్యుత్థితాగ్నిపిశునైః పవనోద్ధూతైః ఆహుతిగన్ధిభిః ధూమైః ఆశ్రమోన్ముఖాన్ అతిథీన్ పునానమ్...।

**ప్రతిపదార్థము :-** అభ్యుత్థిత - అగ్ని - పిశునైః - ప్రజ్వలించిన అగ్నికి సూచకములును, పవన - ఉద్ధూతైః - గాలిచేత ఎగురకొట్టబడినవియును, ఆహుతిగన్ధిభిః - హోమద్రవ్యముల వాసనగలవియును అగు, ధూమైః - పొగలచే,





ఆశ్రమోన్ముఖాన్ - ఆశ్రమములోనికి ప్రవేశించుచున్న, అతిథీన్ - అతిథులను, పునానమ్ - పవిత్రము చేయుచున్నదియును అగు. (ఆశ్రమమ్ ప్రాపత్।)

**తాత్పర్యము :-** ప్రజ్వలించిన అగ్నికి సూచకములును, గాలిచేత ఎగురకొట్ట బడినవియును, హోమద్రవ్యముల వాసనగలవియును అగు పొగలచే, ఆశ్రమములోనికి ప్రవేశించుచున్న అతిథులను పవిత్రము చేయుచున్నదియు అగు ఆశ్రమమునకు దిలీపమహారాజు సపత్నీకుడై చేరెను.

**విభక్తులు / క్రియలు :-** 1. అభ్యుత్థితాగ్నిపిశునైః - ...పిశునేన, ...పిశునాభ్యాం, **...పిశునైః**; ...పిశునశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః తృ.బ.। 2. అతిథీన్ - అతిథిం, అతిథీ, **అతిథీన్**; అతిథిశబ్దః ఇకారాన్తః పుల్లిఙ్గః ద్వితీయాబహువచనాన్తః। 3. ఆశ్రమోన్ముఖాన్ - ఆశ్రమోన్ముఖం, ఆశ్రమోన్ముఖౌ, **ఆశ్రమోన్ముఖాన్;** ఆశ్రమోన్ముఖ శబ్దః అకారాన్తః పుల్లిఙ్గః ద్వితీయాబహువచనాన్తః। 4. పునానమ్ - **పునానమ్,** పునానౌ, పునానాన్; పునానశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః ద్వితీయైకవచనాన్తః। 5. పవనోద్ధూతైః - పవనోద్ధూతేన, పవనోద్ధూతాభ్యాం, **పవనోద్ధూతైః;** పవనోద్ధూతశబ్ద అకారాన్తః పుల్లిఙ్గః తృ.బ.। 6. ధూమైః - ధూమేన, ధూమాభ్యాం, **ధూమైః**; ధూమశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః తృ.బ.। 7. ఆహుతిగన్ధిభిః - ఆహుతిగన్ధినా, ఆహుతిగన్ధిభ్యాం, **ఆహుతిగన్ధిభిః**; ఆహుతిగన్ధిన్‌శబ్దః నకారాన్తః పుల్లిఙ్గః తృ.బ.।

**సమాసాలు :-**

1. అభ్యుత్థితాగ్నిపిశునైః - అభ్యుత్థితాః చ తే అగ్నయః చ, అభ్యుత్థితాగ్నయః అభ్యుత్థితాగ్నీనాం పిశునాః అభ్యుత్థితాగ్నిపిశునాః (ష.త.), తైః।
2. ఆశ్రమోన్ముఖాన్ - ఆశ్రమస్య ఉన్ముఖాః ఆశ్రమోన్ముఖాః (ష.త.), తాన్।
3. పవనోద్ధూతైః - పవనేన ఉద్ధూతాః పవనోద్ధూతాః (తృ.త.), తైః।
4. ఆహుతిగన్ధిభిః - ఆహుతీనాం గన్ధః ఆహుతిగన్ధః (ష.త.), ఆహుతిగన్ధః ఏషామస్తీతి ఆహుతిగన్ధినః (కృ.), తైః।

**పాఠాన్తరాలు :-** 1. అభ్యుత్థితా... - అభ్యుద్ధృతా... - అభ్యుద్ధతా..

**సంధులు :-**

1. ...పిశునైః + అతిథీన్ - ...పిశునైరతిథీన్ - విసర్గసన్ధిః।
2. పవనోద్ధూతైః + ధూమైః - పవనోద్ధూతైర్ధూమైః - విసర్గసన్ధిః।

3. ధూమైః + ఆహుతిగన్ధిభిః - ధూమైరాహుతిగన్ధిభిః - విసర్గసన్ధిః(రేఫాదేశః)।

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు :-**

**1. పునానః :-** ఎ) Purifying శానచ్ ప్రత్యయాన్తము, 'పూఞ్ (పూ) పవనే - సకర్మకమ్ సేట్, ఉభయపదీ. ఆత్మనేపదీ పదములపై ఈ ప్రత్యయము వచ్చును.

బి) హోమధూమము పవిత్రత్వమును కలిగించునదే కాక ఆయుష్షును సైతము పెంచుననుటకు ప్రమాణము కలదు.

శ్లో॥ వృద్ధార్కో హోమధూమశ్చ
బాలాస్త్రీ నిర్మలోదకమ్।
రాత్రౌ క్షీరాన్నభుక్తిశ్చ
ఆయుర్వృద్ధిర్దినేదినే॥

సి) 48వ శ్లోకమునుండి 53వ శ్లోకము వఱకు 'సః ఆశ్రమం ప్రాపత్।' అనునది ఒకటే అన్వయము. కనుక ఇది 'కులకము' అనబడును.

**అలంకారాలు :-** ఇట 'విరోధాభాసాలంకార' మున్నదని చారిత్రవర్ధనుడు పేర్కొనినాడు.

**సంజీవినీ :-**అభ్యుత్థితేతి. - అభ్యుత్థితాః - ప్రజ్వలితాః - హోమయోగ్యా ఇత్యర్థః . 'సమిద్ధేऽగ్నా వాహుతిం జుహో తీ' తి శ్రుతేః - తేషా మగ్నీనాం - పిశునైస్సూచకైః, పవనోద్ధూతైః వాయుక్షి ప్తైః, ఆహుతీనాం గన్ధః ఏషా మస్తీ త్యాహుతిగన్ధినః తైః, ధూమైః ఆశ్రమోన్ముఖా నతిథీన్, పునానం పవిత్రీకుర్వాణమ్.

---

**అవతారిక :-** దిలీపః పత్న్యా సహ రథాదవతతార -

**శ్లో॥ అథ యన్తారమాదిశ్య**
**ధుర్యాన్విశ్రామయేతి సః।**
**తామవారోపయత్పత్నీం**
**రథాదవతతార చ॥ 54**

**పదవిభాగము :-** అథ, యన్తారమ్, ఆదిశ్య, ధుర్యాన్, విశ్రామయ, ఇతి, సః, తామ్, అవరోపయత్, పత్నీమ్, రథాత్, అవతతార, చ।





**అన్వయక్రమము :-** అథ సః యన్తారమ్ ధుర్యాన్ విశ్రామయ ఇతి ఆదిశ్య తాం పత్నీం రథాత్ అవారోపయత్ అవతతార చ।

**ప్రతిపదార్థము :-** అథ - ఆశ్రమము ముంగిటకు చేరుకున్న పిదప, సః - ఆ దిలీపమహారాజు, ధుర్యాన్ - రథాశ్వములను, విశ్రామయ - విశ్రమింపజేయుము, ఇతి - అని, యన్తారమ్ - సారథిని, ఆదిశ్య - ఆజ్ఞాపించి, పత్నీమ్ - భార్యయగు, తామ్ - ఆ సుదక్షిణాదేవిని, రథాత్ - రథమునుండి, అవారోపయత్ - దింపించెను. అవతతార చ - తానును దిగెను.

**తాత్పర్యము :-** ఆశ్రమము ముంగిటకు చేరుకున్న పిదప ఆ దిలీపమహారాజు 'రథాశ్వములను విశ్రమింపజేయుము' అని సారథిని ఆజ్ఞాపించి, భార్యయగు ఆ సుదక్షిణాదేవిని రథమునుండి దింపించెను, తానును దిగెను.

**విభక్తులు / క్రియలు :-** 1, అథ - అవ్యయమ్। 2. యన్తారమ్ - **యన్తారమ్,** యన్తారౌ, యన్త్యాన్; యన్తృశబ్దః ఋకారాన్తః పుల్లిఙ్గః ద్వితీయైకవచనాన్తః। 3. ఆదిశ్య - ల్యప్ ప్రత్యయాన్తమవ్యయమ్। 4. ధుర్యాన్ - ధుర్యం, ధుర్యౌ, **ధుర్యాన్;** ధుర్యశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః ద్వితీయాబహువచనాన్తః। 5. విశ్రామయ - లోట్ - మధ్యమపురుషైకవచనాన్తః। 6. ఇతి - అవ్యయమ్। 7. తామ్ - **తామ్,** తే, తాః; తచ్ఛబ్దః దకారాన్తః స్త్రీలిఙ్గః ద్వితీయైకవచనాన్తః। 8. అవారోపయత్ - లఙ్ - ప్రథమపురుషైకవచనాన్తః। 9. రథాత్ - **రథాత్**, రథాభ్యాం, రథేభ్యః; రథశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః పఞ్చమ్యేకవచనాన్తః। 10. అవతతార - లిట్ - ప్రథమపురుషైక వచనాన్తః। 11. చ - అవ్యయమ్।

**సమాసాలు :-**

1. ధుర్యాన్ - ధురం వహన్తీతి ధుర్యాః (కృ.), తాన్।

**పాఠాన్తరాలు :-**

1. విశ్రామయేతి - విశ్రమయేతి - విశ్రామమేతి - విశ్రామమేత।
2. తామవారోపయత్ - తామవారోహయత్

**సంధులు :-**

1. విశ్రామయ + ఇతి - విశ్రామయేతి - గుణసన్ధిః।
2. రథాత్ + అవతతార - రథా దవతతార - జశ్త్వమ్।

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు :-**

**1. యన్తృ :-** 1) ఎ) యమ్ - తృచ్ బి) **యన్తా** - ప్రథమైకవచనాన్తః। సి) **యన్తారమ్** - ద్వితీయైకవచనాన్తః।

శ్లో॥ పత్తిః పదాతిం రథినం రథేశః
తురఙ్గసాదీ తురగాదిరూఢమ్।
**యన్తా గజస్యాభ్యపతత్** గజస్థం
తుల్యప్రతిద్వన్ద్వి బభూవ యుద్ధమ్॥ - ర.వం. 7-37

ఇట **'గజారూఢుడు'** అని అర్థము.

బి) శ్లో॥ ఆయస్తః సురసరిదోఘరుద్ధవర్త్మా
సంప్రాప్తుం వనగజదానగన్ధిరోధః।
మూర్ధానం నిహితశితాంకుశం విధున్వన్
**యన్తారం** న విగణయాంచకార నాగః॥ - కిరాతే - 7-32

అడవి ఏనుగు మదం వాసనకల నదీతీరాన్ని చేరటానికి ప్రయత్నించిన ఏనుగుకు గంగా ప్రవాహము అడ్డుపడింది. దానికి తోడు వాడి అంకుశముతో తలపై పొడవగా కోపంతో తలను దులపరించి సారథిని లెక్కించుటలేదు.

సి) శ్లో॥ తస్య తత్పూజయన్ కర్మ **యన్తుర్దానవసత్తమః।**
శూలేన జ్వలతా తం తు స్మయమానోఽహనన్మృధే॥
- శ్రీమద్భాగవతమహాపురాణమ్ - 8-11-17

"...రథసారథియొక్క ఆ పనిని శ్లాఘించుచు యుద్ధమున..."

**క్రియాదర్శము :-1. విశ్రామయ -** 'వి' ఇత్యుపసర్గ పూర్వకాత్ 'శ్రము-తపసి ఖేదే చ'ఉత్। ఇత్యేతస్మాద్ధేతుం అణ్ ణిజన్తాద్ధాతోస్సకర్మకాద్విధ్యర్థే లోటి పరస్మైపదే మధ్యమపురుషైకవచనాన్తః।

**విశ్రామయ/** విశ్రామయతాత్ - విశ్రామయతం - విశ్రామయత।

**2. అవారోపయత్ -** 'అవ' ఇత్యుపసర్గపూర్వకాత్ 'రుహ - బీజ జన్మని ప్రాదుర్భావే చ',ఇత్యస్మాత్ ణిజన్తాద్ధాతోస్సకర్మకాత్కర్తరి భూతే లఙి పరస్మైపదే ప్రథమపురుషైక వచనాన్తః।





**అవారోపయత్** - అవారోపయతాం - అవారోపయన్

**3. అవతతార -** 'అవ' ఇత్యుపసర్గపూర్వకాత్, 'తౄ - ప్లవనతరణయోః', ఇతి అస్మాద్ధాతోరకర్మకాత్కర్తరి భూతే లిటి పరస్మైపదే ప్రథమపురుషైకవచనాన్తః।

**అవతతార** - అవతేరతుః - అవతేరుః

**సంజీవినీ :-** అథేతి. - అథ - ఆశ్రమప్రాప్త్యనన్తరం - స రాజా, యన్తారం సారథిం, ధురం వహన్తీతి ధుర్యాః. ధురో యడ్ఢకావి' తి యత్ప్రత్యయః. 'ధూర్వహేధుర్య ధౌరేయ ధురీణా శ్చ ధురన్ధరా' ఇత్యమరః - ధుర్యాన్ రథాశ్వాన్ విశ్రామయ వినీతశ్రమాన్ కురు, ఇతి ఆదిశ్య ఆజ్ఞాప్య, తాం పత్నీం, రథా, దవారోపయత్ అవతారితవాన్, స్వయం చావతతార.

---

**అవతారిక :-** మునయః గోప్త్రే తస్మై అర్ఘణాం చక్రుః -

**శ్లో॥ తస్మై సభ్యాః సభార్యాయ
గోప్త్రే గుప్తతమేన్ద్రియాః।
అర్హణామర్హతే చక్రు-
ర్మునయో నయచక్షుషే॥ 55**

**పదవిభాగము :-** తస్మై, సభ్యాః, సభార్యాయ, గోప్త్రే, గుప్తతమేన్ద్రియాః, అర్హణామ్, అర్హతే, చక్రుః, మునయః, నయచక్షుషే।

**అన్వయక్రమము :-** సభ్యాః గుప్తతమేన్ద్రియాః మునయః సభార్యాయ గోప్త్రే నయచక్షుషే అర్హతే తస్మై అర్హణామ్ చక్రుః।

**ప్రతిపదార్థము :-** సభ్యాః - సభ్యులును, గుప్తతమేంద్రియాః - మిక్కిలి జితేంద్రియులును అగు, మునయః - ఋషులు, సభార్యాయ - భార్యతోకూడి కొన్నట్టియు, గోప్త్రే - సంరక్షకుడైనట్టియు, నయచక్షుషే - శాస్త్రమే కన్నుగా గలవాడును, అర్హతే - పూజ్యుడును అగు, తస్మై - ఆ దిలీపమహారాజు కొఱకు, అర్హణామ్ - పూజను, చక్రుః - చేసిరి.

**తాత్పర్యము :-** జితేంద్రియులగు ఋషులు, సపత్నీకుడు, సంరక్షకుడు, పూజ్యుడగు ఆ దిలీపమహారాజును పూజించిరి.

**విభక్తులు / క్రియలు :-** 1. తస్మై - **తస్మై,** తాభ్యాం, తేభ్యః; తచ్ఛబ్దః దకారాన్తః పుల్లిఙ్గః చతుర్థ్యేకవచనాన్తః। 2. సభ్యాః - సభ్యః, సభ్యౌ, **సభ్యాః**; సభ్యశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః ప్ర.బ.। 3. సభార్యాయ - **సభార్యాయ**, సభార్యాభ్యాం, సభార్యేభ్యః; సభార్యశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః చతుర్థ్యేకవచనాన్తః। 4. గోప్త్రే - **గోప్త్రే,** గోప్తృభ్యాం, గోప్తృభ్యః; గోప్తృశబ్దః ఋకారాన్తః పుల్లిఙ్గః చతుర్థ్యేకవచనాన్తః। 5. గుప్తతమేన్ద్రియాః - గుప్తతమేన్ద్రియః, గుప్తతమేన్ద్రియౌ, **గుప్తతమేన్ద్రియాః**; గుప్తతమేన్ద్రియశబ్దః అకారాన్తః పుల్లిఙ్గః ప్రథమాబహువచనాన్తః। 6. అర్హణామ్ - **అర్హణామ్**, అర్హణే, అర్హణాః; అర్హణాశబ్దః ఆకారాన్తః స్త్రీలిఙ్గః ద్వితీయైకవచనాన్తః। 7. అర్హతే - **అర్హతే,** అర్హద్భ్యాం, అర్హద్భ్యః; అర్హచ్ఛబ్దః తకారాన్తః పుల్లిఙ్గః చతుర్థ్యేకవచనాన్తః। 8. చక్రుః - లిట్ - ప్రథమపురుషైకవచనాన్తః। 9. మునయః - ప్ర.బ. 10. నయచక్షుషే - చ.ఏ.

**సమాసాలు :-**

1. సభార్యాయ - భార్యయా సహ వర్తత ఇతి సభార్యః (బ.), తస్మై।
2. గుప్తతమేన్ద్రియాః - అత్యన్తం గుప్తాని గుప్తతమాని (తద్ధి.), గుప్తతమాని ఇన్ద్రియాణి యైః తే, గుప్తతమేన్ద్రియాః (బ.)।
3. నయచక్షుషే - నయః ఏవ చక్షుః యస్య సః, నయచక్షుః (బ.), తస్మై।

**సంధులు :-**

1. చక్రుః + మునయః - చక్రుర్మునయః - విసర్గసన్ధిః (రేఫాదేశః)।
2. మునయః + నయచక్షుషే - మునయో నయచక్షుషే - ఉత్వాదేశః।

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు :-**

**1. నయచక్షుషే** - ఎ) 'నయతి తత్త్వమితి నయః శాస్త్రమ్'

బి) శ్లో॥ కామం కర్ణాన్తవిశ్రాన్తే విశాలే తస్య లోచనే।

చక్షుష్మత్తా తు శాస్త్రేణ సూక్ష్మకార్యార్థదర్శినా॥ - ర.వం. 4-13

'ఆ రఘువుయొక్క కన్నులు చెవులవఱకు వ్యాపించి విశాలములై యున్నను, సూక్ష్మాతిసూక్ష్మములైన కర్తవ్యములను చూపునట్టి శాస్త్రజ్ఞానమువలననే అతడు కన్నులు కలవాడని ప్రసిద్ధినందెను.'

'శాస్త్రదృష్టిర్వివేకినామ్' అను దానిని బట్టి శాస్త్రజ్ఞానజన్యమైన వివేకమే అతనికి నేత్రమైనదని భావము.





**అలంకారాలు :-** ఇట **'అనుప్రాసాలంకార'**మున్నదని చెప్పదగును.

**'వర్ణసామ్యమనుప్రాసః'** Reccurrence of similar words.

**క్రియాదర్శము :- 1. చక్రుః** - 'డుకృఞ్ కరణే' ఇత్యస్మాద్ధాతోస్సకర్మకాత్ కర్తరి భూతే లిటి పరస్మైపదే ప్రథమపురుషబహువచనాన్తః।

చకార - చక్రతుః - **చక్రుః**

మునిభిరర్హణా చక్రే। కర్మణిప్రయోగః।

**సంజీవినీ :-** తస్మా ఇతి - సభాయాం సాధవః సభ్యాః. 'సభాయా య ది' తి యత్ప్రత్యయః, గుప్తతమేన్ద్రియాః అత్యన్త నియతేన్ద్రియాః, సభార్యాయ, గోప్త్రే రక్షకాయ, నయః శాస్త్రమేవ - చక్షుః తత్త్వావేదకం ప్రమాణం - యస్య తస్మై నయచక్షుషే , అత ఏవ, అర్హతే ప్రశస్తాయ - పూజ్యాయేత్యర్థః. 'అర్హ ప్రశంసాయా మి' తి ధాతోః శతృప్రత్యయః, తస్మై రాజ్ఞే, అర్హణాం పూజాం, చక్రుః. 'పూజా నమస్యాపచితిః సపర్యార్చార్హణాః సమా ఇ' త్యమరః.

---

**అవతారిక :-** సాయన్తనవిధేరనన్తరం సః వసిష్ఠం దదర్శ -

**శ్లో॥ విధేః సాయన్తనస్యాన్తే**

**స దదర్శ తపోనిధిమ్।**

**అన్వాసితమరున్ధత్యా**

**స్వాహయేవ హవిర్భుజమ్॥** **56**

**పదవిభాగము :-** విధేః, సాయన్తనస్య, అన్తే, సః, దదర్శ, తపోనిధిమ్, అన్వాసితమ్, అరున్ధత్యా, స్వాహయా, ఇవ, హవిర్భుజమ్, ఇవ।

**అన్వయక్రమము :-** సాయన్తనస్య విధే అన్తే సః అరున్ధత్యా అన్వాసితం తపోనిధిం స్వాహయా అన్వాసితం హవిర్భుజమ్ + ఇవ దదర్శ।

**ప్రతిపదార్థము :-** సాయన్తనస్య - సాయంకాలమందు పుట్టిన, విధేః - జపహోమాద్యనుష్ఠానముయొక్క, అన్తే - అవసానమందు, సః - ఆ దిలీపమహారాజు, అరున్ధత్యా - అరున్ధతీదేవిచేత, అన్వాసితమ్ - సేవింపబడిన, తపోనిధిమ్ - తపస్సునకు నిధియగు వసిష్ఠులవారిని, స్వాహయా - స్వాహాదేవిచేత, అన్వాసితమ్ - సేవింపబడిన, హవిర్భుజమ్ + ఇవ - యజ్ఞేశ్వరునివలె, దదర్శ - చూచెను.

